రక్తాక్షినామసంవత్సర చైత్ర, వైశాఖ, జ్యేష్ఠమాసములకుఁ బంపవలసిన
యాజ్ఞవల్క్య పత్రికలుగా పంపఁబడినవి, సంపాదకులు

# అద్వైతము

ఇది

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారిచే

రచియింపఁబడినది.

---

తెనాలి: రజత ముద్రాలయమున

ముద్రింపఁబడినది.

1924.

---

మూల్యము 3 అణాలు.

# ప్రధాన పోషకులు.

---

మ- రా॥ రా॥ మణుగుల సూర్యనారాయణమూర్తిగారు.

,, కొత్వాల రామచంద్రరావు వేంకటేశ్వరరావు దేశపాండ్యా ముక్తేదారుగార్లు.

,, రావుసాహేబు కొప్పర్తి యజ్ఞన్నపంతులుగారు.

# పోషకులు.

---

,, పట్టస్వామి చలపతిరావుగారు.

,, మండ వేంకటరమణయ్యగారు.

,, కోడూరి అచ్యుతరామయ్యగారు.

,, కాకర్లమూడి వేంకట్రాయుడు పంతులుగారు.

,, పొట్లపల్లి వేంకటేశ్వరరావుగారు.

,, నల్లగొండ రామచంద్రయ్యగారు.

,, మిరియాల నారాయణగారు.

,, పొడు శేషయ్యచౌదరిగారు.

---

# ఉపోద్ఘాతము.

నాకుఁ జిరకాలమునుండి మతకర్తల జీవితచారిత్రములనే కాక వారి బోధనములనుగూడ వ్రాయవలయు ననెడి కౌతుకముగలదు. ఇంతకుమున్ను విశిష్టాద్వైతమతకర్తలగు రామానుజుల చరిత్రాదికముల సంగ్రహముగా వ్రాసి ప్రకటించితిని. ఇప్పుడు శంకరుల జీవితచారిత్రాదులను వ్రాయుభాగ్య మబ్బినందునకు మిగుల సంతసించుచున్నవాఁడను. శంకరావతారమని చెప్పెడి యీ యాచార్యుల జన్మకాలాదులను గూర్చి యొక్కొక్కగ్రంథమునం దొకవిధముగ నున్నది. కొందఱుకొన్ని గ్రంథములందు విక్రమశక మెనిమిదివందల నలువదియైదవ (౮౪౫) వర్షమునందు జన్మించెననియు, మఱికొన్ని గ్రంథములందు శంకరుఁడు క్రీస్తుశకమునకుఁ దరువాత నెనిమిదవ శతాబ్దియందున్నవాఁడనియు, వేఱొకకొన్ని గ్రంథములందుఁ బ్రథమశతాబ్దియందే యున్నవాఁడనియు హేతువులపై హేతువులను బల్కుచు నూహములపై నూహములను బన్నుచుఁ దమతమ వాదములను బయల్పఱచిరి. బహు పరిశ్రమముచేసి దేశచరిత్రముల నెన్నిటినో వ్రాసిన యొకచరిత్రకారుఁడు "విశ్వవిఖ్యాతుఁడగు నిమ్మహానుభావుఁడు శివుని యవతారమనియుఁ గుమారిలభట్టుయొక్క చరమదశయందుదయించెనని, మన హిందువుల యభిప్రాయమై యున్నదనియు, నితఁడు క్రీ. శ. ౮ వ శతాబ్దియం దుదయించియుండు ననియు, నితఁడు మళయాళ బ్రాహ్మణుఁడనియు, ముప్పదిరెండు సంవత్సరములు మాత్రము జీవించియుండి బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసియై యాసేతుహిమాలయ మంతయుఁ దిరిగి పరమత ఖండనమును స్వమత మండనమును జేయుచు నీదేశములోని బౌద్ధమతమును బూర్తిగా నడుగంటఁ జేసెననియు, నితఁడు తత్త్వవేత్తలకు నద్వైత సిద్ధాంతంబును, సామాన్యజనులకు శివుఁడు, విష్ణువు, గణపతి, మొదలగు దేవతలందఱను

భేదములేక పూజింపవలయు ననెడి పౌరాణికమతమును బోధించె ననియు, నీతఁడు బౌద్ధదర్శనములోని యనేక సిద్ధాంతములను గ్రహించి బుద్ధుఁడు విష్ణుని దశావతారములలో నొక్క యవతారమని వచించుచు ననేక బౌద్ధులను హిందువులుగ మార్చె ననెదరనియు, వ్యాసకృత వేదాంతసూత్రములకును, దశోపనిషత్తులకును శంకరుఁడు భాష్యములు వ్రాసెననియు వీనికిఁ బ్రస్థానత్రయమని పేరనియు, యుక్తివాదమున నీప్రస్థానత్రయంబును మించిన మఱియొక గ్రంథ మీహిందూదేశమున లేదని చెప్పవచ్చుననియు, శంకరాచార్యుఁడు హిమాలయములోని బదరీకేదారములో మృతుఁడయ్యె ననియు, ధర్మవ్యవస్థకై యాతఁడు హిందూదేశమునందు నాల్గుమఠముల నేర్పఱచెననియు నుత్తరహిందూస్థానమునకై బదరీకేదారములోను, దక్షిణహిందూదేశమునకై శృంగేరిలోను బూర్వహిందూస్థానమునకై జగన్నాథములోను, బశ్చిమహిందూస్థానముకై ద్వారకలోను శంకరపీఠములు నిర్మింపఁబడె ననియు, ఆదిని నాలుగుమఠములే యున్నను బ్రస్తుతము శంకరమఠము లసంఖ్యాము లైనవనియు, శాంకరమతస్థుల నద్వైతులనియు స్మార్తులనియుఁ బిల్చెదరనియు హిందువులలో నూటికి నెనుబదిమంది స్మార్తమతస్థులై యున్నారనియు" వ్రాసెను. ఇంకొకరు కలియుగాబ్దము ౩౮౮౯ చన విభవసంవత్సర వైశాఖమాసము నందార్ద్రానక్షత్ర యుతమగు శుక్లపక్ష పంచమినాఁడు మధ్యాహ్నమునం దభిజిన్ముహూర్తమునం దవతరించె ననియు వ్రాసిరి. మొదటఁ జూపినట్లు విక్రమశకాబ్దములే సరియైనవైనచో నీయాచార్యు లిప్పటికొక వేయియు నిరువదిరెండు సంవత్సరములనాఁ డవతరించెనని చెప్పుకొనవచ్చును. పైని వ్రాసినట్లు శాంకరమతస్థులెల్ల నాధర్మములను దెలిసికొనినప్పుడుగదా నిజమగుశాంకరమతస్థు లనుకొనఁదగియుందురు. మూర్తీభవించిన బ్రహ్మజ్ఞానమనఁదగిన శంకరభగవానులయెడ నెంతటి మూఢుఁడైనను దిరస్కారభావమును జూపునా ! అట్టి మాన్యుని చరిత్రమును బోధనములను దెలిసికొనుటకంటె భాగ్యమున్నదా !

లేదనియే యనుకొనెదను. మఱియు నవతారపురుషుల కద్భుతములగు నమానుషకృత్యము లుండకుండుట చిత్రమేకాని యుండుటొక చిత్రము గాదనుకొనెదను. ఇట్టి వెన్నియో యీ యాచార్యుల చరిత్రమునందుఁ జేర్కొనఁబడి యున్నవి. ఊరక మేమద్వైతులము మేము ద్వైతులమని చెప్పుకొనినంతనే లాభములేదు. అవతార పురుషులు మనకొఱ కెంతయోపాటుపడి చూపినమతమును జక్కఁగాఁ బరిపాలించు కొనినపుడే మనమెట్టివారమని చెప్పుకొనినను బాగుగా నుండును.

కాటకూటేశ్వరము,
20—3—24.

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి.

# అద్వైతము.



(శాంకరమతము.)

ఈమతమును స్థాపించినదెవరు ? వారే దేశమునజనించిరి ? వారి తల్లిదండ్రులెవరు ? గురువులెవరు ? మతవ్యాపన మెట్లొనర్చిరి ? అనెడి విషయములను సవిమర్శకముగాఁ జర్చించుకొందము. ఈయద్వైత మతమును స్థాపించినది యాదిశంకరాచార్యులు. అందుచే నీమతము నకు శాంకరమతమనెడిపేరును గలదు. ఈయాచార్యులవారి జననాది విషయములు తెలిసికొనుటకు శంకరవిజయాది గ్రంథములే యాధార ములు. అందుఁ జెప్పఁబడియున్న చరిత్రమునందలి కొన్ని భాగములు యీ మతానుయాయులు గౌరవాధిక్యమునకై కల్పించిరని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు తమ మతకర్తయెడ నసమాన మైన మహిమము లుండినట్లు చెప్పినఁగాని లోకులకు విశ్వాసమేర్పడ దనియెంచి యమానుషకృత్యములను గొన్నిటిని జేర్చి భగవదవతారమే యని నమ్మికకలుగునట్లు చేయుదురని చెప్పుదురు. ఇట్టి మాటలతో మనకుఁ బనిలేదు. అవతారపురుషులకు విచిత్రచరిత్రములు లేక యుండునా ! ఇఁక నాయా గ్రంథములందుఁ జూపఁబడియున్న చరిత్రాం శములను సంగ్రహింతము. పూర్వమొకప్పుడు నారదుఁడీ లోకము నకు రాఁగా నిందలిజను లద్వైతజ్ఞానములేక సౌర శాక్తాదిమతము లందుఁ బ్రవేశించి యుండుటచే నామహర్షి సత్యలోకమునకుఁజని యీ ప్రవృత్తి నంతయుఁ బరమేష్ఠి కెఱుకపఱుపఁగా నాతఁడును నా దురవస్థను దొలఁగించునుపాయ మూహింపలేక మానివర్యుని వెంటనిడు కొని కైలాసమున కరిగి తాము విచ్చేసిన కారణమును జెప్పఁగా మహాదేవుఁ డిట్లనియెనఁట :—భూలోకమునందుఁ గేరళదేశమున "కాలడి" యను నగ్రహారము గలదు. అందు వృషభేశ్వరున కావాసమగు వృషాద్రియేకాక చూర్ణినదియుఁ గలదు. ఆరెంటిచే

నది యెంతయుఁ బవిత్రమైనది. అట్టి గ్రామమునందుఁ బుత్రార్థియై (శివభట్టు) శివగురుఁడను విప్రుఁడు కులసతియగు ఆర్యాంబతోఁ గూడి యజ్ఞాదు లొనర్చుచున్నవాఁడు కావున వారలకుఁ బుత్రుఁడనై పుట్టి యద్వైతమతమును స్థాపింపఁగలనని చెప్పిన పిదప నొకనాఁటి వేకువజామునఁ గలలో నావిప్రదంపతులకుఁ గాన్పించి మీరు కోరు కొనునట్లపత్యలాభము గలుగునట్లనుగ్రహించెదను గాని వివేకహీను లును, దీర్ఘాయుష్మంతులును నగు పుత్రులు పదుగురు కావలయునో! అట్లుకాక యల్పాయుష్కుఁడును సర్వశాస్త్ర విశారదుఁడును నగు సుతుఁ డొక్కఁడే కావలయునో! కోరుఁడనఁగా సకలశాస్త్ర విశారదుఁ డగువాఁ డొక్కరుఁడే చాలునని యనుకొనఁగా నామహాదేవుఁ డంత ర్ధానమందెను. పిమ్మట నీజాయాపతులు తమ స్వప్నవృత్తాంతము నొండొరులు చెప్పుకొని పరమానందభరితులగుచు బ్రాహ్మణసమా రాధనము చేయఁగా మిగిలిన యన్నమును భక్షింపఁ జూచునపుడు జ్యోతి యొక్కటి యందుఁ బ్రవేశించెను. అంత వారు పరమానంద ముతో దానిని భక్షించిరఁట. అంత నార్యాంబ గర్భవతియై కలి యుగాబ్దములు మూఁడువేల యెనమన్నూట యెనుబదితొమ్మిది సంవత్స రములకు సరియగు విభవ సంవత్సర వైశాఖ శుక్ల పంచమినాఁడు మాధ్యాహ్నమునం దార్ద్రానక్షత్ర యుక్తమగు నభిజిన్ముహూర్తమునందు మగబిడ్డను గనెనఁట. అంత నాబిడ్డనికి శంకరుఁడని పేరిడిరి. ఏది యెట్లున్నను కేరళదేశమునందలి "కాలడి" యను గ్రామమునం దార్యాంబకును శివభట్టునకును విక్రమశక మెనిమిది వందల నలువది యైదవ సంవత్సరమున శంకరాచార్యులు జనించి రనుమాట తథ్యము కాదా! ఆ కాలడియను గ్రామమునే కొందఱు "కాలపి" యనియు మఱికొందఱు "కాలటి" యనియు ననుచున్నారు. మణిమంజరి యందు "విధవాయాః సకాశాత్" అని యున్నది. దీని తాత్పర్య మేమియో తెలియరాకున్నది. ఈవిమర్శనముల కేమి! తరువాతి కథాభాగమునకు వత్తము. అంత నాబాలునకు మూఁడవయేఁటఁ

కాలమున నక్షరాభ్యాసమును గావించి యైదవయేఁట నుపనయనమును గావించి వేదవేదాంగములను సమ్యగముగాఁ జదివించిరి. అట్టి యవతారపురుషుల కావిద్య లోక లెక్కయా! అంత శివగురుఁడు సకలవిద్యలు నేర్చిన తన కొమరునకు వివాహము సేయ సమకట్టు చుండఁగా శంకరులు "నాతండ్రికి దేమి వెఱ్ఱి! తనకాసన్నమవు మృత్యువు నెఱుఁగక నాకు వివాహముచేయఁ జూచుచున్నాఁడు. నాతత్త్వమును దెలియకున్నాఁడే!" యని చింతిలుచుండఁగానే పరమపదము జెందిన తండ్రి కుత్తరక్రియలు చేసి తల్లి నోదార్చుచు నుండెనఁట. అంత నొక్క నాఁడు శంకరులు తల్లితోఁ జూర్ణ నదికిఁ జని యందు నీరాడుచుండఁగా నొక మకర మాశంకరుని చరణములను బట్టి వదలకుండుటచేఁ దల్లి యగు నార్యాంబతో అమ్మా! ఇందు నన్నొక మొసలిపట్టి మ్రింగఁ జూచుచున్నది. నే నీ విధముగ మృతి నొందితినేని నా పుట్టువు పనికి మాలినదాను! అందుచే నాకుసన్యాసము గైకొన నన్నుజ్ఞ యిమ్మనగా నాపె చేయునదిలేక సమ్మతించుటచే నప్పటికి మానస సన్యాసమును గ్రహించెనఁట. అంత నా మొసలియు నా యాచార్యుని పాదములు వదలి గంధర్వాకారము నంది "స్వామీ! నాపేరు పుష్పరథుఁ డందురు ఒకప్పుడు పద్మాసనుని యానతి మీఱుటచే నన్నా దేవుఁడు మొసలివై పుట్టునట్లు శపియించెను. అంత నాకు గతియేమని వేఁడి కొనఁగా నద్వైత మతస్థాపనమునకై యవతరించెడి శంకర పాదస్పర్శ నమువలన శాపవిమోచన మగునని చెప్పెను. "నేఁటికాభాగ్య మబ్బిన ది"దని నుతించుచు నిజలోకమున కరిగెనఁట. అంత నా యాచార్యులు తల్లికిఁ బ్రణమిల్లి యల్లన నుల్లము పల్లవింప నిట్లయెను. తల్లీ! నాకీఁకఁ గ్రమమగు సన్యాసము గైకొనఁబోవ నానతిమ్మా! నీ వింటికరిగి పరమాత్మ ధ్యానముతోఁ గాలము కడపుట శ్రేయమగు పని. ఎప్పుడేనియు నీవు నన్నుఁ జూడనెంచినపుడు నన్నుఁ దలఁచితివేని యప్పుడే నీచెంత కరుదెంతు నని చెప్పి తల్లియానతిఁగొని పయనమై చనిచని బదరికాశ్రమమునందుఁదపం బొనర్చుచున్న గోవింద భగవత్పా

దాచార్యుల పాదసన్నిధి కరిగెను. అంత నాయాచార్యులకు నమస్క రించి తనవృత్తాంతమంతయు విన్నవింపఁగా వారుతత్త్వమస్యాది మహా వాక్యార్థములే కాక సన్యాసులకుఁ దెలియవలసిన సకల రహస్యముల నెఱుకపఱచి క్రమముగ సన్యాసమిచ్చిరి. పిమ్మట నొకప్పుడు గోవింద భగవత్పాదులు శిష్యుఁడగు శంకరునితో "నీవు వేదాదిసకలవిద్యల నెఱిఁగినవాఁడవు కాన యద్వైతార్థము ప్రతిపాదించు బ్రహ్మసూత్రాది గ్రంథములకు భాష్యములను రచియించి లోకోపకార మొనర్పుమని యాజ్ఞాపించి తనచెంతనుండిన శ్రీ చంద్రమౌళీశ్వర లింగముసే కాక రత్నగర్భుఁడగు గణనాథునిఁగూడ నాశంకరుని కిచ్చివేయుచు వాని చరిత్రము నిట్లుపేర్కొనియెను:—శంకరా! వీనిని మొట్టమొదట నాదిగురువగు భవానీపతి యద్వైతవిద్యను బోధించి నారాయణున కొసఁగెను, ఆనారాయణుఁడు బ్రహ్మకును, బ్రహ్మవసిష్ఠునకును, వసిష్ఠుఁడు శక్తికిని, శక్తి పరాశరునకును, పరాశరుండు వేదవ్యాసునకును, వేద వ్యాసుఁడు శుకునకును, శుకుఁడు గౌడపాదాచార్యులకును నొసగిరి. ఆగురువర్యునివలనఁ బడసిన వానిని నేఁడు నీకిచ్చుచున్నాఁడను కావున వీనిని విడువక పూజసేయుచు నద్వైతామృతరసాస్వాదనము చేయు చుండుము" ని చెప్పియిచ్చెను. అంతనాశంకరభారతియు గురునాజ్ఞ శిరమునఁదాల్చి వ్యాససూత్రములకును దశోపనిషత్తులకును భగవద్గీతల కును విష్ణుసహస్రనామాది గ్రంథములకును భాష్యములనే కాక శాస్త్ర జ్ఞానములేనివారలకుఁగూడ నుపయోగించెడి వివేక చూడామణి మొదలైన కొన్నిగ్రంథరాజములను రచియించి శిష్యవర్గమున కుప దేశించినట్లు చెప్పుదురు. ఇంక నీశంకరుల కెవ్వరెవ్వరెట్లు శిష్యులైరో తెలిసికొందము. పిమ్మట నొకనాఁడు విష్ణుశర్మయను పేరుగల యొక విప్రుఁడు శంకరులచెంత కరిగి తనకు నద్వైతవిద్యను బ్రసాదింపుఁడని వేఁడికొనఁగా నాతనికి సన్యాసమిచ్చి యాయద్వైతవిద్యను బోధించి సనందులనెడి పేరిడిరి. వీరే శంకరులకుఁ బ్రథమశిష్యులు. పిమ్మట వీరికిఁ బద్మపాదులను నామాంతరము వచ్చెను. ఇట్లుకాలము గడచు

చుండగాఁ నొకనాఁడార్యాంబ తనపుత్రుఁడగు శంకరునిఁ దలఁచినంతనే యాసర్వజ్ఞుఁడును దనతల్లికి మరణమాసన్నమగుచున్నదని తెలిసికొని వేవేగ నచ్చోటికి విచ్చేసి మాతృదేవత కుపచారమొనర్చుచుండఁగనే యామెపరలోకమున కరిగెనని చెప్పుదురు. ఈకథాభాగమునందొక విచిత్రవిషయమునుగలదు. అనుదినమును జూర్ణనదికరిగిస్నానమొనర్చెడి తల్లి శంకరునితో నిట్లనియెనట:—నాయనా! నేఁడీవ్యాధిచే నిటనుండి కదలి నదికిఁ బోలేకున్నదానను. నేనేమిచేయుదునని దుఃఖింప నారంభింపఁగా నాచార్యులు తనమహిమముచే నాయేఁటినిఁ దన యింటి చెంతకు వచ్చునట్లు చేసెనఁట. అందుచే దానికంబానదియని పేరువచ్చెనని చెప్పుదురు. అనఁగా అంబ కొఱకుఁ దేఁబడినదిగాన యంబానదియైనదని యర్థము. అంతశంకరులు పరలోకమునకరిగిన జననికి సంస్కారములు గావించి ప్రయాగ క్షేత్రములకుఁ బోయి యందుఁ బెక్కండ్రకు భాష్యార్థము లుపదేశించుచుండఁగా దివాకరుఁడను పాఱుఁడు మూగయనెడి పేరిడిన తన కొమరుని వెంటనిడుకొని యాచార్యుల యభ్యాసమునకరుదెంచి యెట్లయినను దనతనయుని ధన్యునిగా జేయుఁడని వేఁడికొనెను. అంత నాబాలునిగాంచి యాచార్యులిట్లనిరఁట:వత్సా! నీవేరిపుత్రుఁడవు? నీనామధేయమేమి? ఎందుండివచ్చితివి? ఎచ్చటకుఁ బోనెంచితివి? ఎందునకై నీవిచ్చటికి వచ్చితివి? యని ప్రశ్నింపఁగా నాబాలుఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:—అయ్యా! నేనొకరి పుత్రుఁడనని చెప్పుటకు మనుజుఁడనుగాను; దేవుఁడనుగాను; బ్రాహ్మణుఁడనుగాను; క్షత్రియుఁడనుగాను; వైశ్యుఁడనుగాను; శూద్రుఁడనుగాను. బ్రహ్మచారినిగాను; గేస్తుఁడనుగాను; వానప్రస్థుఁడనుగాను;సన్యాసినిగాను; మఱేమగుదునందురా ఆత్మస్వరూపమగు తత్త్వమునే నేనగుదును అని యీవిధముగా మారుపల్క,నాచార్యులు సంతసించి దివాకరునితో నీతనయుఁడు సన్యాసమున కర్హుఁడనిచెప్పి, యాబాలునకుసన్యాసమిచ్చి శిష్యునిగఁ జేసికొని యద్వైతము బోధించెను. అతఁ డటుచేతియందలి

యామలకము (యుసిరికకాయ) వలె నాత్మస్వరూపమును దెల్పుటచే శంకరులాతనికి హస్తామలకుఁడని పేరిడిరి.

తర్వాతఁ గొంతకాలమునకు శంకరులు కాశీక్షేత్రమునకుఁ జని మణికర్ణికాఘట్టమున భూదేవులకుఁదామురచియించిన భాష్యములను బోధించుచు నుండఁగా నొక దినమునందాచార్యులు గంగానదియొక్క యావలి యొడ్డున నుండిన సనందులను శిష్యునిఁ బిలువఁగా నాతఁడు వెల్లివిరిసిపాఱు గంగానదినిగాంచి యిట్లనియెను:—దుస్తరమగు సంసారాంబుధినుండి సుఖంబుగఁ దరిఁజేర్చెడి యాచార్యుల యనుగ్రహము నన్నీ నదిని దాఁటింపఁదాయని తలపోయుచుఁ బ్రవాహముపైనుండి వడి వడిగా నడయాడఁ దొడఁగెను. అంత నా స్రోతస్వినియు నాతనికిఁగల గురుభక్తికి మెచ్చుకొనుచుఁదనయందలి పద్మములను నతఁడిడఁబోయెడి యడుగులక్రిందఁ బ్రసరింపఁజేయఁగా నానదిని నాతఁడు సుఖముగా దాఁటి యాచార్యులచెంతకువచ్చెను. అంత నావిచిత్రచరిత్రమునుగాంచి భగవత్పాదు లాతనికిఁ బద్మపాదుఁడని పేరిడిరఁట. నిజముగా నిట్టివి భక్తియన నేమియో నెఱుఁగనివారికి నమానుషకృత్యములుగాఁదోఁచి నను దోఁపవచ్చును. ఇదియొక చిత్రముకాదు! ఒకనాఁడు శంకరులు విశ్వేశ్వరుని సందర్శించి విశ్వేశ్వరా! మహాజనులెల్లరును వినుచుండ నద్వైతము సత్యమైనదో! ద్వైతము సత్యమైనదో! చెప్పుమని వేఁడికొనఁగా నా మహాదేవుఁడు ముమ్మాటికిన ద్వైతమే సత్యమైనదని చెప్పి యంతర్ధానము నందెనఁట. అప్పటినుండియు జనులు ద్వైతభావనన్ను వదలి యద్వైతభావననే చేయఁ జొచ్చిరనియుఁ జెప్పుదురు. అట్లు కాశికాపురమునం దాచార్యులుండునపుడు విశ్వనాథాధ్వరికొమరుఁడగు కళానాథుఁడను బ్రాహ్మణుఁ డాచార్యులసన్నిధికి విచ్చేసి "విదితాఖిల శాస్త్రసుధాజలధే"యనెడి తోటకవృత్తములచే నుతించి వారి యనుగ్రహమును బడసి సన్యాసమును బుచ్చుకొనుటచే నాచార్యులాతనికిఁ దోటకాచార్యులని పేరు పెట్టిరఁట. మఱియు నొకవాసరమున వేద వేదవ్యాసులు మణికర్ణికా ఘట్టమున స్నానము చేయుటకై యరు

దేరఁగా శ్రీశంకరులచ్చట శిష్యవర్గమునకు భాష్యాదులు బోధించుచున్నారని వినవచ్చుటచే నా వ్యాసుఁడు వృద్ధ బ్రాహ్మణ రూపమును దాల్చివచ్చి శంకరులను గొన్ని ప్రశ్నముల నడుగఁగా వారొసఁగిన ప్రత్యుత్తరములకు మిగుల సంతసించుటయే కాక సూత్రభాష్యము నంతయుఁ జదివించి విని యదియెల్లఁ దన యభిప్రాయమును బాగుగ లోకమునకుఁ దెలియఁజేసి మహోపకార మొనర్చుచున్నదని నుతించి యీ యాచార్యులు దీర్ఘాయుష్మంతుఁడగునేని లోకమున భాష్యమునకు మఱింత ప్రచారముగలుగునని తలఁచి తత్క్షణమే కమలగర్భుని మనమునఁ దలఁపగా నాతఁడు ప్రత్యక్షమై శంకరు లొనర్చిన భాష్యములను విని సంతసించెనఁట. పిమ్మట వ్యాసుఁడా బ్రహ్మదేవునిఁ గాంచి యీ యాచార్యుల కాలమును జూతమా మిగులఁ దక్కువగా నున్నది. అతని భాష్యములను జూతమా మహత్తరములయి యున్నవి. కావున యెట్లయిన నితకింకను నాయు వొసఁగుమని ప్రార్థింపఁగా నట్లేయని తిరోహితుఁడయ్యెనఁట. ఇట్లు కాశికాపురమునందు శంకరులు కొంత కాలముండి శైవపాషండాది మత ఖండన మొనర్చిన పిమ్మట భట్టాచార్యులుండిన రుద్ధపురమునకుఁ జనిరఁట. అప్పుడాతఁడు తుషాగ్నియందుఁ బ్రవేశించి యుండుటఁ జూచి యిట్లు చేయనేలయని యడుగఁగా నా భట్టాచార్యు లిట్లనిరి:— స్వామీ! సౌగతమత తత్త్వమును దెలిసికొనవలయుననెడి తలఁపుతో మాఱువేషమును గైకొని యామతాచార్యులయొద్దఁ జదువుటయేకాక యా మతమును ఖండించి గురుద్రోహ మొనరించితికాన యట్టి పాపము పాయుటకై యీ తుషాగ్నిఁ జొచ్చితిని. మీతో నే నే విధముగను శాస్త్ర వాదము చేయఁజాలను. కావున కాశ్మీర దేశమునందున్న నాశిష్యుఁడగు మండనమిశ్రుని చెంతకుఁ జనుదెంచు! ఆతఁడు సకల శాస్త్రముల నెఱిఁగినవాఁడు! కర్మ బ్రహ్మ వాదియని యనినంతనే శంకరులు మండనమిశ్రుఁ డుండిన కాశ్మీరమునకుఁ జని యాతనితో నిట్లనిరి.

పురకాంతాళితోఁ గలియుటచేఁ గామశాస్త్రవిశారదుఁ డయ్యెను. ఇది యంతయు నాభూపుని జ్యేష్ఠభార్యయగు కనకమంజరి యనునామెకు విచిత్రమై తోఁపఁగా నామె యమాత్యవర్యుని బిలిపించి యిట్లాన తిచ్చెను:—ఈవిగ్రహము మాత్రము మన ప్రభువర్యునిదే యగునుఁ గాని యందలి యాత్మమును జూడ నెవఁడో యొక యోగిపుంగవుఁడు పరకాయప్రవేశ విద్యచే నందుఁ బ్రవేశపెట్టినట్లు కాన్పించుచున్నది. కావున యీనగరమునకుఁ జుట్టుప్రక్కల నుండెడి శవముల నెల్ల దహింప నియోగింపుము. అట్లనుటయు నాతఁ డానగరప్రాంతము నంతయు వెదకింపగా నొక్కచోట చెట్టుతొఱ్ఱలో నున్న యాచార్యుల శరీరమును గాంచి యగ్నిసంస్కారము చేయనున్నతఱి శిష్యులు గాయకవేషములతో రాజనగరున కరిగి "నిరస్తమసి" యనెడి శ్లోకములతో భూపతిగాత్రమున నున్న యాచార్యులకుఁ దెలియునట్లు పాడిరి. అంత నాయాచార్యులు పిచ్చుకయై యాకసమున కెగసి వచ్చునంతలోఁ దమశరీరము గాలుకొనిపోవుచున్న నందుఁ జొచ్చి "శ్రీమత్పయోనిధి" యనెడి శ్లోకముతో లక్ష్మీనృసింహుని నుతింయించెనఁట. అంత నాదేవుఁడును సంతసించి నిదురనుండి మేల్కాల్పినట్లు యగ్నిని చల్లార్చి సుఖముగా లేవదీసి యంతర్ధాన మొందెనఁట. పిమ్మట నాచార్యులు వెనుక తాను శపథముచేసి వచ్చినట్లు మరల సరసవాణి యొద్దకుఁ జని యామె నోడింపఁగా నామె యిట్లనియెను:—శంకరా! ఏనోడిపోయితిని. ఇఁక నీతో వాదింపఁజాలను. దివమున కేగఁ దలచితిని కావున నాకానతిమ్మనినంతనే శంకరులు అమ్మా! భక్తులను గావ నీవీలోకమున నిలువవలయు నని యర్థించి యాదేవతను నిల్పుటకై యనువగు చోటెద్దియాని వెదకి వెదకిఁ దుదకుఁ దుంగభద్రాతీర మందలి విభాండకమానివర్యుని తపోవనమునకువచ్చి శ్రీమలహానికరేశ్వరుని సందర్శించి యందే యొక స్థలమునం దామెకు దేహాయతనమును నిర్మించి యొక్క సుముహూర్తమునందు యథావిధిగా శ్రీచక్రమును లిఖియించి వైభముతో శ్రీశారదాంబ నందుఁ బ్రతిష్ఠించుటయే కాక

నేను నీతో శాస్త్రవాదమును జేయవచ్చితిని. నిజముగా నీవే యీవాదమునందు నన్నోడింపఁ గలిగితివా నేనును గేస్తుఁడ నయ్యెదను. అట్లుకాక నేనే జయమందితిని నీవు సన్యాసిగావలయు నని ప్రతిజ్ఞచేసి మన యిరువురకు నడుమ నీభార్యయగు సరసవాణి యుండుఁగాక ! యని వాదింపఁదివురఁగా శంకరులే జయమందుటచే నామండనమిశ్రునకు సన్యాస మొసఁగి సురేశ్వరాచార్యుఁడను నామ మిడి శిష్యునిగాఁ జేసికొనిరి. ఈమండనమిశ్రుఁడు శుక్లయజుర్వేది యనుటకుఁ బెక్కు నిదర్శనములు గలవు. మఱియు నాతని భార్య యగు సరసవాణి సరస్వతీదేవి యంశమున నవతరించినదగుటచే సత్య లోకమునకుఁ జనఁజూచునపు డాచార్యు లామెతో వాదించి యామె చేయనెంచిన సిద్ధాంతము లన్నిటికిఁ బూర్వపక్షముఁ జెప్పఁగా నామె యీతనిని జయించెడి యుపాయ మిది కాదనుకొని కామశాస్త్రమును గూర్చి ప్రసంగించెను. అంత నాయాచార్యులు చేయునదిలేక యిట్లని యెను:—అమ్మా ! నీయభిప్రాయము నే నెఱుఁగుదును. ఒక్కనెల నాకు గడువొసఁగితివా మరలి వచ్చి నీప్రశ్నముల కన్నింటికి సమాధాన మీయనేర్తునని ప్రతిజ్ఞచేసి యామెను వీడ్కొని తనశిష్యుల వెంటనిడు కొని యమరేశ్వరుని రాజధానియగు నమృతమను నగరమునకు విచ్చే యఁగా నానృపతి మృతినొందెను.అంత నాశవమును రాజపతులు లోన గువారలు వల్లకాటికిఁ గొంపోయి యగ్ని సంస్కారముచేసి యేడ్చుచు మరలి వచ్చుచుండుట గాంచి యాచార్యులు తమ దేహము నొకవృక్ష కోటరమునం దుంచి జాగ్రత్తగాఁ జూచునట్లు శిష్యుల కాజ్ఞాపించి తాను పరకాయప్రవేశము చేయు విద్యచేఁ జితిపైఁబెట్టిన యాభూపతి శరీరమును జొచ్చి దాని నటునిటు కదలింపసాగెను. దానిం గాంచి యచ్చట నుండెడి బంధువులు లోనగువారలు మన ప్రభువు మృతి నొందలేదు, ప్రాణములతోడనే యున్నవాడని సంతసించుచు మరల నగరమునకుఁ గొనిపోయిరి. అంత నాపార్థివుని శరీరమును జొచ్చిన యాచార్యులు నీతితప్పక రాజ్యపాలన మొనర్చుటయే కాక యంతః

యొక మఠమునుగూడ నిర్మించి యందు విద్యాపీఠము నుంచి దానికి సురేశ్వరాచార్యుల నధిష్ఠింపఁజేసి శ్రీ చంద్రమౌళీశ్వర లింగమును రత్నగర్భ గణపతినిఁగూడ నిచ్చివేసి యచ్చటనే యుండి వానిని బూజించుచుఁ దాము రచియించిన భాష్యములకెల్ల వార్తికములను రచియింపుమని యానతిచ్చి యందుండి కాంచీనగరాధీశునికడకుఁజని యాతనిచే శ్రీ వరదరాజస్వామికిని శ్రీమదేకామ్రనాథునకును, శ్రీ కామాక్షి దేవికి నాలయములను గట్టింపఁజేయుటయేకాక కామాక్షి గుడిలో శ్రీచక్రమునులిఖించియుంచి యాపురమందలి విద్వద్వర్యులకెల్లర కద్వైత మతమును బోధించిరి. తుంగభద్రాతీరమునందలి మఠాధిపతులగు సురేశ్వరాచార్యులును గురునాజ్ఞ ప్రకారముగా బృహదారణ్యకమునకును తైత్తిరీయకమునకును వార్తికములనేకాక దక్షిణామూర్తి స్తోత్రమును మానసోల్లాసమును బ్రణవవార్తికమును నైష్కర్మ్యసిద్ధిలోను గాఁగల కొన్ని గ్రంథరాజములను గూడ రచియించిరి. పూర్వాశ్రమమునందు శుక్లయజుర్వేదియగు నీ సురేశ్వరాచార్యులెంత ధీమంతులు గాకుండిన శంకరు లట్లుచేయుదురా! అంత నాచార్యులు కాంచీ పురమునుండి కదలి తిరుపతికిఁ బోయి వేంకటేశ్వరులను సేవించి యచ్చటినుండి కాళహస్తికిఁబోయి శ్రీ కాళహస్తీశ్వరుని భజియించి చిదంబరమునకుఁ జేరి సౌరమతమును ఖండించిరి. తర్వాత మధ్యార్జున క్షేత్రమునందున్న మహాదేవునిఁగొల్చి రామేశ్వరమునకుఁ బోయి రామేశ్వరుని సందర్శించి యందుఁ గాపాలిక మతమును ఖండించి వక్రతుండపురికిఁ బోయిరి. అందును గాణాపత్యమును ఖండించిన పిమ్మట మధురాపురమునకుఁబోయి సుందరేశ్వరుని సందర్శించి యనంతశయనమునకుఁ బోయి శ్రీమదనంత పద్మనాభుని నుతియించి యందలి వైష్ణవ పాఖండ మతములను నిరసించి శివకేశవులకు నామభేదము తప్ప రూపభేదమించుకంతయు లేదని చెప్పి "హరిరూపధరశ్శంభుః" అనెడి శ్లోకముల నుపదేశించి యచ్చటివారలకుండిన భేదబుద్ధిని బోఁగొట్టి వారల నెల్లర నద్వైత మతావలంబులనుగాఁ జేసిరఁట. అంత నాయాచా

ర్యులు వాసుకి క్షేత్రమునకుఁ బోయి కుమారస్వామిని సేవించి మృడపురికిఁ బోయి యందలి భౌద్ధ మతమును ఖండించి యందుండి గోకర్ణమునకుఁ బోయి మహాబలేశ్వరునిఁ గొనియాడి శ్రీశైలాది పుణ్యక్షేత్రములను సేవించుచు జగన్నాథమునందున్న శ్రీ జగన్నాథుని సేవించుటయేకాక యచ్చట నొకమఠమును నిర్మించి దానికి భోగవర్ధనమను పేరిడి పద్మపాదాచార్యులదానికి నధిపతిగాఁజేసి యందుండిజని యుజ్జయినికిఁబోయి మహాకాళేశ్వరునిఁగాంచి యందలి శాక్యమతమును ఖండించి యచ్చటినుండి భూమినిఁ బ్రదక్షిణింపనెంచి ద్వారవతికిఁబోయి యందును నొక మఠమునుగట్టించి హస్తామలకాచార్యుని దానికధిపతినిగాఁజేసి గోకులమునకుఁబోయి యందుండి మాయాపురమున కరుగఁగా నచ్చట నుండెడి యాయాచార్యుల శిష్యవర్గము వారితో నిట్లనిరి:—స్వామీ! తాము ప్రసాదించిన యద్వైతతత్త్వమెల్ల నిర్గుణతత్త్వమునే తెలుపుచుండుటచే నిర్మలహృదయులగు మహావిద్వాంసులకే గోచరించును గాని కలిప్రాబల్యముచే మలినమనస్కులగు సామాన్యజనులకు బోధపడకుండును గావున శైవము శాక్తము, వైష్ణవము, సౌరము, గాణాపత్యము, కాపాలమనెడి యాయామతములనే నిలుపుఁడని వేఁడికొనఁగా శంకరభారతి యందుల కియ్యకొని శాస్త్రవిరోధములేకుండఁగ షణ్మతస్థాపనము గావించిరఁట.

ఈవిధముగా విశ్వవిఖ్యాతులగు శంకరులు భూమండలమునందెల్లనద్వైతమతస్థాపనముచేసి బదరికాశ్రమమునకుఁజని నారాయణుని బూజించి యందొక మఠమునునిర్మించి దానికిఁ దోటకాచార్యుల నధ్యక్షునిగాఁజేసిరని చెప్పుటయేకాక యొకప్పుడు స్నానమునకై తన కుష్ణోదకసరస్సునిమ్మని శ్రీహరినిఁ బ్రార్థింపఁగా నట్లేయని ప్రసాదింపఁగా నందు స్నానముచేయుచుఁ గొంతకాలముండఁగా దత్తాత్రేయుఁ డచ్చోటికరుదెంచి యాచార్యులు రచియించిన భాష్యములను విని

యానందించి నీవా శంకరుఁడవే కాని యన్యుఁడవు కావు. అద్వైత మతము నిల్పుటకై యవతరించినవాఁడవు. అట్లు భూమియందెల్ల యెడల నద్వైత మతము స్థాపింపఁబడినది కావున యిఁక కైలాసమున కరుగఁజను ననఁగా నా యోగీంద్రునితో గుహచొచ్చి కళేబరము తోడఁ గైలాసమున కరిగెనని చెప్పుదురు. ఈ చరిత్రమందలి కొన్ని యంశములు కొందఱకు విరుద్ధముగాఁ దోఁచునేమో తోఁచి నను దోఁచనిండు! అవి యాచార్యుల మహిమాతిశయమును మట్టుపఱుపఁజాలవా!

ఇఁక నాచార్యులవారు స్థాపించిన యద్వైతమననేమియో తెలిసికొనుటకు ముందు శ్రీవారేయే గ్రంథములను బ్రమాణముగాఁ గైకొని యామతమును స్థాపించిరో తెలిసికొందము. ఈశాంకర మతమునే సకలదేశములవారును బట్టులుపొగడినట్లు పొగడుచున్న వారుకదా! ఆ యాచార్యులీమతమును వేదాదులను బ్రమాణముగాఁ జేసికొని స్థాపించిరి కాని కేవలము యుక్తులతోడనే స్థాపించియుండ లేదు. ఇంకను వీరు ప్రస్థానత్రయమునేకాక తత్త్వజ్ఞుల యనుభవమును గూడ గ్రహించిరి. భగవద్గీతలు, వేదాంతసూత్రములు, ఉపనిషత్తులను నీమూఁటికే ప్రస్థానత్రయమని పేరుపెట్టిరి. ఇందలి బ్రహ్మసూత్రమును రచియించినది వ్యాసులు, ఈ సూత్రములకే యుత్తరమీమాంసయనియు, శారీరకమనియు నామాంతరములు గలవు. శారీరకమనఁగా సకలపదార్థములు శరీరముగాఁగల పరబ్రహ్మమును గూర్చి చెప్పుగ్రంథమని యర్థము. ఆ బాదరాయణులు సకలోపనిషత్తులను సమన్వయింపఁజేసి వాని యభిప్రాయమెట్టిదో తెల్పిరి. మఱియు శంకరులచ్చటచ్చట సంవాదార్థరూపమగు స్మృతి పురాణేతిహాసములనుగూడ నుదాహరించుచు వచ్చిరి,

ఈ శాంకరమతమన నేమియో మూఁడుమాటలతోఁ జెప్ప

వచ్చెను. అందు మొదటిది బ్రహ్మము. ఇదియే సత్యమైనది. రెండవది జగము. ఇది యసత్యమైనది. మూఁడవది జీవుఁడు. ఇతఁడు బ్రహ్మమేకాని యన్యుఁడుకాదు. మఱియు నిట్టి యద్వైత మతమును గూర్చి మఱియెవ్వరయినను గ్రంథములు వ్రాసినవారుగలరా! అట్టివారిలో మతభేదము లెవ్వియైన నుండెనేమోయని పరిశీలింతము. ఇంకనీ యద్వైతగ్రంథములు రచియించినవారు సురేశ్వరాచార్యులు, సర్వజ్ఞముని, వాచస్పతి మిశ్రులు, వివరణకారులు, విద్యారణ్యస్వాములు, మధుసూదనస్వాములు, అప్పయదీక్షితులు లోనగువారలుగలరు. వీరందఱును శంకరులు చూపిన మార్గమునుబట్టియే పోయిరి. అట్లయిన నిఁకభేదమెందుఁ జూపట్టునందురేమో! అద్వైతమున కంతకును ముఖ్యమగు జీవమునకును బ్రహ్మమునకును నైక్యమును జెప్పుటకుఁ గొన్ని యవాంతర విషయములలోఁ దాత్పర్యభేదము గాన్పించుచుండును. ఇట్లుండుటకుఁ గారణమేమందురా! వినువారి మనస్సునకుఁ జక్కఁగా నెక్కునట్లు తెలుపుటకై యొక్కొక్కరొక్కొక్క విధముగాఁబోయిరి. అనఁగా జీవమును బ్రహ్మము నొక్కటియేయని బోధించు పద్ధతులలోమాత్రము భేదముగలదని యర్థము. వీరిలోనుండెడి సూక్ష్మమతభేదములను దెలిసికొనుటకై యప్పయదీక్షితులు సిద్ధాంతలేశ సంగ్రహమను గ్రంథమును రచియించిరి. దానివలన నాయవాంతర భేదములన్నియుఁ దెలియఁగలవు.

ఇఁక ముందుగా నీజగదుత్పత్తికిఁ గారణ మెవరెట్లు నిర్ణయించిరో కనుఁగొందము. సకలదేశములందుండు భౌతికశాస్త్రవేత్తలును దత్త్వశాస్త్రవేత్తలును గార్యరూపమగుఁ బరమకారణ ముండవలయునని విమర్శింపఁదొడఁగిరి. అట్లు విమర్శించిన పిదప నెవరేకారణమును జూపిరో తెలిసికొందము! అందుఁ దార్కికు లేమనిరి? అణువులే జగత్కారణ మనిరి. సాంఖ్యులు దేనిని నిర్ణయించిరి? ప్రధానమునే ముఖ్యకారణముగా నిర్ణయించిరి. అగమాయులు హిరణ్య

గర్భతత్త్వమునే మూలకారణముగా నెన్నికొనిరి. శూన్యవాదుల భావమునే పరమకారణమనిరి. ఇట్లే మఱికొందఱు మఱికొన్ని కారణములను గానుపింపఁజేసిరి. ఎవరెట్లెంత విమర్శించిచెప్పిన నద్వైతులు దీర్ఘవిచారణముచేసి జగత్కారణమును జెప్పినట్టితరులు చెప్పియుండలేదని కొందఱందురు. కొందఱనుట యేల? ఒక్కొక్కదానిని జదువ నారంభించిన నందలి యాథార్థ్యము బయలుపడకుండునా! అట్లయినచో నీప్రపంచోత్పత్తికిఁ బైని చెప్పఁబడినవి కారణములు కావని యద్వైతులేకారణమును జూపిరి. బ్రహ్మమే జగత్కారణమని నిరూపించిరి. ఈవిషయమును జక్కఁగా బ్రహ్మసూత్రములందు భాష్యకారులు ప్రతిపాదించిరి. ఇఁక బ్రహ్మమనఁగా నేమి? దానినుండి జగమెట్లు కలిగెనో యోజింతము. బృహదారణ్యకోపనిషత్తునందలి మూఁడవ యధ్యాయమున నున్న గార్గి యాజ్ఞవల్క్య సంవాదమునందు బ్రహ్మముగూర్చి యిట్లు చెప్పఁబడి యున్నది:— అక్షర (బ్రహ్మ) స్వరూపము లావైనది కాదు, సూక్ష్మమైనది కాదు; పొట్టిది కాదు; పొడుగైనది కాదు; ఎఱ్ఱనిది కాదు; ముఖము లేనిది; వాక్కు మొదలగు నింద్రియములు లేనిది; యనెడి విశేషణములతోఁ జెప్పఁబడియున్నది. అట్లే తైత్తిరీయభృగువల్లియందును “ ఈసకలభూతములు దేనినుండి పుట్టుచున్నవో, దేనియందు జీవించుచున్నవో, తుదకు దేనియందులయమగుచున్నవో యదియే బ్రహ్మమని కలదు. (తై. భృ. ౧.) అనఁగా నుత్పత్తిస్థితిలయములకు బ్రహ్మమే కారణమని కలదు. ఇట్లు చెప్పుటచే బ్రహ్మమిట్టిదని బోధపడినదా! లేదు. ఇందునకుఁ గొన్ని యుదాహరణములను జూపి చెప్పినఁ జక్కఁగాఁ దెలియును. అందునకుఁగాను ముందుగా నుపాదాననిమిత్తకారణములన నేమియో తెలిసికొనవలయును. జగమునందుఁ గుండలు చేయుటకుఁ గుమ్మరి నిమిత్తకారణము. మట్టి యుపాదానకారణము.

ఇక్కడకుఁ దేలిన సంగతియేమి? కార్యము చేయువాఁడు

నిమిత్తకారణమనియు ఏవస్తువుతో నాకార్యము చేయఁబడునో యది యుపాదానకారణమనియుఁ దేలినది. సరియే ! బ్రహ్మవిషయమై దీనినెట్లు పోల్చుకొనవలయునో చూతము. ఉపాదాన కారణమగు మట్టిలేకయే నిమిత్తకారణమైన కుమ్మరి కార్యమగు కుండను జేయఁ గలుగునా ! చేయఁజాలఁడుగదా ! అందునకుఁగాను మనమిప్పుడీశ్వరుఁడు కుమ్మరివంటివాఁడనుకొందము. ఇతఁడీ ప్రపంచమును కార్యమును (కుండను) జేయుట కుపాదానమేదియని ప్రశ్నించుకొనినపుఁ డీశ్వరుఁడేయని తేలును. ఈశ్వరుఁడద్వితీయ స్వమాత్రుండుగదా ! అదియెట్లుపొసఁగునందురా ! వినుఁడి ! సాలెపురుగును మీరు చూచి యుందురుగదా ! అదితానునేసెడి బూజునకుఁ దానెనిమిత్తకారణమును తనచొంగచే నాకార్యమును జేయుచున్నది. కావున తనశరీర ప్రాధాన్యమునుబట్టి యుపాదానకారణమును నైనట్లె యీశ్వరుఁడు తన ప్రాధాన్యముచే నిమిత్తకారణమును దన యుపాధి యగు మాయయొక్క ప్రాధాన్యముచేనుపాదానకారణమును నై యున్నాఁడు. ఇక్కడకు మనకుఁ దేలినఫలితార్థమేమి ! నిమిత్తకారణమును నుపాదాన కారణమును దానేయైన పరబ్రహ్మము చరాచరాత్మకమైన ప్రపంచ మును సృజియించుటచేఁ బ్రహ్మమే జగత్కారణమని తేలినది. ఇట్లే యీ బ్రహ్మమే జగత్కారణమని చెప్పుటకు మఱికొన్ని ప్రమాణ ములును గలవు. బృహదారణ్యకోపనిషత్తునందలి మూఁడవ యధ్యా యమున మొదట బ్రహ్మమేయుండెననియు, (బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్) బ్రహ్మసూత్రములందీ ప్రపంచముయొక్క యుత్పత్తిస్థితిలయ ములు బ్రహ్మమువలననే కలిగినవి (జన్మాద్యస్యయతః ౧-౧-౨-౨) యనియుఁ గలదు. ఇందందనేల సకలోపనిషత్తులందును జగ దుత్పత్తికి బ్రహ్మమే కారణమని కలదు. ఈవిధముగా నెన్నియో ప్రమాణములు చూపట్టుచున్నను బూర్వపక్షులీక్రిందివిధముగా నాక్షే పింపఁబూనిరి.—అయ్యా ! మట్టికుండకును, బంగారము కడియమునకు నుపాదానకారణమైనట్టుల జగమునకు బ్రహ్మ మువాదానకారణ

మనుచున్నారుగదా! మీరే బ్రహ్మమెట్టిదని సెలవిచ్చిరి? చేతనమును మిగులఁ బరిశుద్ధమును నైనదనెడి కొన్ని మాటలను జెప్పిరి! సరియే! ఇకఁ బ్రపంచమెట్టిదని సెలవిచ్చిరి! జడమును మిగుల నపరిశుద్ధమును, రాగద్వేషాది విశిష్టమును, సుఖ దుఃఖ మోహాత్మకమును నైనదనిగదా! సెలవిచ్చిరి! బాగు! బాగు!! అట్టి బ్రహ్మమునకు నిట్టి ప్రపంచకమునకును గార్యకారణ భావములోఁ బ్రకృతి వికార భావమెట్లు పొసఁగునో విచారింపఁగలిగితిరా! సరియే! అది యట్లుండనిండు! వికారమునందుఁ బ్రకృతిధర్మములుండక తప్పదుకదా! కారణమునకు విరుద్ధములగు ధర్మములు కార్యమగు ప్రపంచమునందు గానిపించుటవలన శబ్దప్రమాణమెంతయేని యుండనిండు! అది లోకానుభవమునకు విరుద్ధముగాఁ గారణవిరుద్ధధర్మములు కార్యమునందుఁ గాన్పించుటచే మీరనినట్లు బ్రహ్మకారణవాదము బాగుగా లేదనియే వారియాక్షేపము. అందునకు సమాధానము చెప్పలేకుందురా! ఎట్లు చెప్పెదరో! మీరనిన ప్రకృతి వికారభావ మత్యంత సారూప్యమున్నచోట నుండనేయుండదు కాని కొన్ని యంశములలోఁ బ్రకృతివికారభావమున్నచోటులందు సారూప్యముండి మఱి కొన్ని యంశములలో వైరూప్యముండితీరవలయును. బ్రహ్మము నందలి సత్తాంశము జగమునందనువర్తించును. చైతన్యము, పారిశుద్ధ్యము మొదలగునవి కారణగతములగు విలక్షణాంశములుగదా! అవి యెప్పుడును గార్యమునందు సంక్రమించుటలేదు. ఈ ప్రపంచము చూతము కార్యభూతమైనది. జాడ్యాపరిశుద్ధాదులన్నవో దీనికి లక్షణాంశములుగదా! ఇవి కారణమునుండి పుట్టియుండలేదు. అందుచే జగత్కారణము బ్రహ్మమనుటలో నాక్షేపమేమియును లేదు. మఱియుఁ బరిణామోపాదానమనియు, వివర్తోపాదానమనియు నుపాదానకారణము రెండు విధములుగానున్నది. పాలు పెరుఁగుగను, మట్టికుండగను మాఱుట పరిణామమందురు. ముత్తెపుఁజిప్ప వెండిగను, త్రాఁడు పాముగను గాన్పించుట వివర్తమగును. పాలును మట్టియు నెంతసత్యములయినవో పెరుఁ

గును గుండయునుగూడ నంత సత్యములయినవి యేకదా! అట్లే త్రాడు వలెఁ బామును, ముత్యపుఁజిప్పవలె వెండియును సత్యములయినవియా! కావుకదా ! అట్లయ్యును రజ్జుశుక్తులనుగూడఁ గారణములుగా నంగీకరించిరి. కార్యమునందుఁ గారణములు సంక్రమింపవలయుననెడి నేమము పరిణామోపాదాన విషయమేకాని వివర్తోపాదాన విషయము కాదు.

ఇఁక నీప్రపంచవిషయమునందుఁ గొందఱకు మతభేదములు గలవుకావున వానినిగూడఁ దెలిసికొందము. మాయయే పరిణామోపాదానమనియు, బ్రహ్మమే వివర్తోపాదానమనియుఁ గొందఱందురు. మఱికొందఱో బ్రహ్మమే కారణమైనను దానికి సహకారిమాయయని చెప్పుదురు. వేఱొకకొందఱు మాయయే యుపాదానకారణమనియు బ్రహ్మము తదధిష్ఠానమైనది కావున యౌపచారికముగా నుపాదాన కారణమనియుఁ దలఁచుచున్నారు. ఇవ్విధముగా నద్వైతులలో భేదములు గాన్పించుచుండినను బ్రహ్మ మొక్కటియే సత్యమైనది యనుటలోఁ గాని, ఎట్లయినను బ్రహ్మమునుండియే ప్రపంచ ముత్పన్నమైనదనుటలోఁ గాని భేదమించుకంతయుఁ గానరాదు.

ఇఁక బ్రహ్మ మెట్టిదో విచారింతము. ఈప్రపంచోత్పత్తికి ముందు సజాతీయభేదము గాని, విజాతీయభేదము గాని, స్వగతభేదము గాని లేనివస్తువొకటి యుండెను. దానికే బ్రహ్మమని పేరు. సజాతీయభేద మనఁగాఁ దనవంటివస్తువు వేఱొకటి యుండుట, విజాతీయ భేదమనఁగాఁ దనకంటె విలక్షణమైన వస్తువు వేఱొకటుండుట స్వగతభేద మనఁగాఁ దానే యనేకవస్తువులుగా నుండుట. ఇట్లే కుండ యున్నది; ఇల్లున్నది; ప్రపంచమున్నది యని వ్యవహరింపఁబడుచు సకలపదార్థములయందు వినవచ్చెడి సత్త (ఉనికి) బ్రహ్మమునకంటె సమధికమైనది కాకుండుటచే సద్రూపమనియుఁ దనంతఁదాను బ్రకాశించుచు సకల జగమును బ్రకాశింపఁజేయుటచేఁ జిద్రూపమనియు, విక్షేపశక్తి యెల్ల

నివర్తింపఁగా నుండెడి నిరతిశయానందము గలదియగుటచే నానంద రూపమనియు నాబ్రహ్మమునే యనుచున్నారు. అనఁగా నీప్రపంచము వలె బ్రహ్మము అనృతమైనది కాని, జడమైనదికాని దుఃఖాత్మకమైనదికాని కాకపోవుటచే సచ్చిదానంద మనుచున్నారని యర్థము. కావున యీశుద్ధబ్రహ్మమే సత్యమైనది. అనఁగా నొకప్పుడుండి మఱియొకప్పుడు లేనిదికాని, యొకప్పుడు లేక మఱియొకప్పు డుండి యుండునదికాని కానిది. సరియే! ఇక్కడికి బ్రహ్మమనగా నేమియో కొంచెము తెలిసినది. ఇట్టి నిర్వికారమగు బ్రహ్మమువలననుండి జగదుత్పత్తి యెట్లయ్యెనని ప్రశ్నించుకొంటిమా! మాయాసంబంధము చేత నగుచున్న దని తేలును. కావున మున్ముందుగా నీమాయ యేయే నామములతో వ్యవహరింపఁబడుచున్నదో దాని కీనామము లెట్లు వచ్చెనో! విచారింతము. సకలమును మోహింపఁజేయునది కావున యవిద్యయనియు, నజ్ఞానమనియుఁ, బలువిధముల వికాసమునందియున్న యీవ్యాకృతప్రపంచమునకుఁ బూర్వావస్థ యగుటచే నవ్యాకృతమనియు, మఱ్ఱివిత్తునందు మఱ్ఱిచెట్టు సూక్ష్మరూపముగా నిమిడియుండునట్లీప్రపంచము సంస్కారరూపముగా నున్నదిగాన బీజశక్తియనియు ననుచున్నారు. మఱియు నీప్రపంచము ప్రకృతివికారము కాన ప్రకృతి యందురు. అది యతిసూక్ష్మమును సదసద్విలక్షణమును నగుటచే నవ్యక్తమనిరి. ఈశబ్దార్థములవలననే మాయయనునెట్టిదో తెలియును గదా! ఇది బ్రహ్మమువలె సత్పదార్థము కాఁజాలునా! కాఁజాలదు! ఎందుచేతననఁగా నిదిజ్ఞానముచే నివర్తింపఁబడునది. అనఁగా జ్ఞానముచే దీనికి నివృత్తి కలదు. గావున బ్రహ్మమువలె నిదిసత్పదార్థము కాదని తేలినది. అందుచేత మాయయనిర్వచనీయమగు భావపదార్థముగా మాత్రమంగీకరింపఁ బడుచున్నది. ఎందుచేతననఁగాఁ బ్రత్యక్షమగు నీప్రపంచమెల్ల దానినుండియే బయలువెడలి యనుభవ విషయమగుటచేఁ గేవలమసత్పదార్థము మాత్రమెట్లగును? మఱియుఁ గార్యముచే ననుమేయమైనది. అనఁగా నూహింపఁదగినదని యర్థము. సరియే!

ఇఁక నిట్టి మాయ యీ బ్రహ్మమునందెట్లు లీనమైయున్నదో చూతము! మనశక్తులు నిద్రావస్థయందేమగుచున్నవి? మనలో లయించుచున్నవని కదా చెప్పెదరు. అట్లే నిర్గుణబ్రహ్మమునందు జగదారంభమునకుఁ బూర్వము మాయయు లీనమై యున్నదని చెప్పుచున్నారు. ఇట్లు మాయావిషయ మంగీకరింపఁ బడినపుడు బ్రహ్మము యొక్క శుద్ధత్వమునకుఁగాని, యద్వితీయత్వమునకుఁగాని భంగమెట్లు కలుగనేర్చును? ఏవిధముగను గలుగనేరదు కదా! మఱియుఁ గొందఱద్వైతులు బ్రహ్మమును బారమార్థిక సత్యత్వముగను, బ్రపంచమును వ్యావహారిక సత్యత్వముగను, స్వప్నమును రజ్జుసర్పములను బ్రాతిభాసిక సత్యత్వముగను నొప్పియున్నారు. అందుచే వారల మతమునందా సత్యత్వము పారమార్థికమనియు, వ్యావహారికమనియుఁ బ్రాతిభాసికమనియుఁ ద్రివిధముగానున్నది. మఱికొందఱు పైని చెప్పఁబడిన వానిలోని వ్యావహారిక సత్యత్వమునకును బ్రాతిభాసిక సత్యత్వమునకును భేదమేమియును లేదని పారమార్థికమనియుఁ బ్రాతిభాసికమనియు నా సత్యత్వము ద్వివిధమైనదనుచున్నారు. అందుచే వీరల మతమున జాగ్రత్స్వప్న ప్రపంచముల కేమియును భేదము లేదు. రజ్జువునందు సర్పము తోఁచినట్లే యీ జగమును బ్రహ్మమునందుఁ దోఁచుచున్నది. ఇట్లు తోఁచుటకుఁ గారణము మాయయే కదా! అందున నధిష్ఠానము శుద్ధబ్రహ్మమే యైన జగమునకును గారణమదియే కాని వేఱుకాదు.

ఇఁకఁ బ్రపంచ మెట్లుపుట్టెనో కనుఁగొందము. దీనికి ముందుఁగా మాయ యీశ్వరున కుపాధియని తెలిసికొనవలయును. కాన యీశ్వరుఁడనఁగా నేమియో! మాయ యనఁగా నేమియో కొంచెముగాఁ దెలిసికొనవలయును. మాయ యనఁగా సత్వరజస్తమో గుణములు గలది. మఱియు దానికి విక్షేపశక్తి యనియు, నావరణశక్తి యనియు రెండు శక్తులు గలవు. ఆవరణశక్తి యనఁగా నుండిన వస్తువును దమోగుణముచే నావరించి (అనఁగాఁ గప్పిపుచ్చి) దానిని

గాన్పింపకుండునట్లు చేయునది. కావున యీ యావరణము తమో గుణశక్తియగును. ఇదియే మూలావిద్య యనఁబడుచున్నది. దీనిచే తనే జగము మోహపెట్టఁబడుచున్నది. అందుచే నెట్టి వివేకియైన నెంతయుతియుక్తిశాలియైన, నెంత పండితుఁడైన నీ యావరణశక్తి తన జ్ఞానదృష్టినిఁ గప్పియుండుటచేతఁ దనయందున్న యాత్మమును దెలిసికొనలేకున్నవాఁడు. ఇఁక విక్షేపశక్తి యనఁగా నేమియో నదియు నేమిచేయుచున్నదో తెలిసికొందము. లేనిదాని నారోపించి యున్నట్లుగాఁ గాన్పింపఁ జేయునది విక్షేపశక్తి. ఇది రజోగుణపుశక్తి. ఇదియే సదూపుఁడగు నాత్మునియందు దసద్రూపమగు సకలప్రపంచమును జూపి పురుషునిఁ బ్రపంచ వ్యాపారమునందుఁ బ్రవర్తింపఁజేయు చున్నది. అందుచే మనుజుఁడు పుణ్యకర్మమును జేసి దానికి ఫలమగు సుఖమును, బాపకర్మమును జేసి దానికి ఫలమగు దుఃఖమును ననుభవించుచు భవసాగరమునఁబడి కొట్టుకొనుచున్నాఁడు. మఱియు నిద్రయప్రమత్తుఁడగు పురుషుని నావరించినట్లే యావృతశక్తియు లోపల విక్షేపశక్తిని విజృంభింపఁజేయుచు నంతరాత్మ నావరించుచున్నది. ఇప్పటికిఁ జూచాయఁగా విక్షేపశక్తియన నేమియో యావరణశక్తియనఁగా నేమియో తెలిసినది. ఇఁక నీశ్వరుఁడనఁగా నేమియో తెలిసికొనవలసియున్నది. మాయతోఁ గూడికొనిన చైతన్యమే యీశ్వరుఁ డనఁబడుచున్నాఁడు. ఎందుచేతననఁగాఁ గూటస్థమగు బ్రహ్మమునందు లయించియున్న మాయ ప్రపంచోత్పత్తి కాఁబోవునపు డాలీనదశను వదలి చలనముకలది యగుటచేఁ గార్యమునకు సిద్ధమగును. దీనినిబట్టియే యీశ్వరునకు మాయ యుపాధియని చెప్పఁబడియున్నది. సర్వాంతర్యామి, సర్వనియంత, సర్వశక్తిమంతుఁడు, సర్వజ్ఞుఁ డనఁబడువాఁ డీశ్వరుఁడే. మఱియు నీయీశ్వరుని మాయాశబలమనియు, శబలబ్రహ్మమనియు సగుణమనియు గూడ ననెదరు. ఇఁక నీ యీశ్వరునుండి ప్రపంచోత్పత్తి యెట్లయ్యెనో చూతము. ఈశ్వరోపాధిగా నుండిన మాయయందు సత్వాధిక్య ముండుటచే

నాయనకు స్వస్వరూపావరణము లేకపోవుటయే కాక మాయయే యాయనకు లోనై యున్నది కాని యీయన మాత్రము దానికి లోనై యుండలేదు. మఱియు నీశ్వరుఁడు తనకు లొంగియున్న విక్షేప శక్త్యాత్మకమగు మాయ వలన నీ ప్రపంచ మంతయును సృజి యించెను. అందుఁ దమఃప్రధానమగు భాగముతో నాకాశమును వాయువును, నగ్నిని, జలమును బృథివిని గ్రమముగా నొకదానిలోనుండి మఱియొకదానిని స్సృజియించెను. వీనినే యపంచీకృత సూక్ష్మభూత ములనియు నందురు. అపంచీకృతములనఁగా నైదుగా విభజింపఁ బడనివని యర్థము. ఈ క్రమమునఁ బూర్వపుది చిత్తుతోఁ గూడి కొని ముందు ముందు రాఁబోవుదానికిఁ గారణమగునని తలంపవల యును. అనఁగాఁ జిద్విశిష్టమును, దమఃప్రధానమును, విక్షేప శక్త్యా త్మకమును నగు మాయలోనుండి యాకాశ తత్త్వమును, నట్టి చిద్వి శిష్టాకాశములోనుండి వాయుతత్త్వమును బుట్టినవి. ఇవ్విధముగనే పంచ భూతములు నొకదానిలోనుండి మఱియొకటి పుట్టినవి. ఇవి బహువిరళావ యవములు గలిగియుండుటచే సూక్ష్మభూతము లనఁబడుచున్నవి. వానియొక్క సాత్వికాంశములయందుండి పైనిచెప్పఁబడినట్లు క్రమ ముగా జ్ఞానేంద్రియములయిదును బుట్టినవి. జ్ఞానేంద్రియములనఁగా శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వా ఘ్రాణముననునవియే. సాత్వికాంశ ములు గలిసిన సముదాయముననుండి మనస్సును, బుద్ధియును బుట్టినవి. అట్లే పంచభూతములయొక్క రాజసాంశములోనుండి ప్రత్యేకముగా వాక్పాణి పాదపాయూప స్థలనెడి కర్మేంద్రియము లయిదును, అవి కలసిన సముదాయమునుండియే ప్రాణాపానవ్యానోదానములనెడి పంచప్రాణములును బుట్టినవి. అవ్విధముగా జనించిన జ్ఞానేంద్రియము లయిదును, గర్మేంద్రియము లయిదును, బ్రాణము లయిదును మన స్సును, బుద్ధియును గలసి లింగశరీరములయినవి. లింగశరీరములకే సూక్ష్మశరీరములనియుఁ బేరుకలదు. ఈ వివరము ముందు చక్కఁగాఁ దెలిసికొనఁగలము.

పైని చెప్పిన యాకాశాది భూతము లైదింటిలో మొట్టమొదట నొక్కొక్కదానిని సమముగా రెండేసి భాగములుగఁ జేసి యందు మొదటి భాగమును విడిచి రెండవభాగమును మరల నాలుగు భాగములుగ విభజించునది. ఇట్లుచేసి ప్రతి భూతమునందు నున్న యష్టమాంశముల నాల్గింటినిఁ దక్కిన నాలుగు భూతములలోను అనఁగాఁ దక్కిన నాలుగు భూతములందును నిలిచియున్న యర్ధభాగముతోఁ జేర్పవలయును. ఇట్లు చేసిన ప్రతిభూతమునందును దనభాగము సగముసగమును దక్కిన భూతములలోని యష్టమాంశములు నాలుగును గలసి రెండవసగమును నగును. దీనికే పంచీకరణ మనిపేరు. మనకుఁ దోఁచు భూతజాలాది భూతములన్నియుఁ బంచీకృతములే. అనఁగా వీని యందుస్వభాగమరపాలును, నితరభూతములభాగ మెనిదవపాలునుగలవు. ఈవిధముగ సృజియింపఁబడిన స్థూలభూతములనుండియే సకలప్రాణుల స్థూలదేహములే కాక స్థూలరూపమైన ప్రపంచమును నిర్మింపఁబడినది. ఈవిధముగా సకలప్రపంచము నొక్కవస్తువునుండియే పుట్టినదని తెలిసికొనుట కధ్యారోపజ్ఞానమని వేదాంతులు పేరుపెట్టిరి. అనఁగా సకలప్రపంచమునందు నిండియుండిన వస్తువగు బ్రహ్మమునుండియే వివిధ రూపములుగానుండిన ప్రపంచ ముత్పన్నమైనదని తెలిసికొనుట కధ్యారోపజ్ఞానమనిపేరు. ఇట్లు బ్రహ్మమునుండి ప్రపంచము పుట్టిన క్రమము విమర్శింపఁబడినది. ఇదిక్రమమగు విమర్శనము. ఇఁక జగము నుండియే పైకి బ్రహ్మమువఱకుఁ గ్రమరహితముగా ననఁగా జివరనుండి మొదటిదగు బ్రహ్మమువఱకు విమర్శించుకొనుచుఁ బోయినను భేదమేమైన గాన్పించునేమో చూతము. ఇట్లుచేయుటకే యపవాదమందురు. ఈవిధముఁగా జూచినను బ్రహ్మము ప్రపంచమునకంటె వేఱైనది కాదని తేటపడును. కార్యమున్నదే (ఉపాదానకారణమగు జగత్తు) పేరునకును రూపమునకును మాత్రమే భేదముగానున్నది కాని వస్తువునందేమైనను భేదముకలదా! లేదు.

ఇంతకుమున్న చెప్పినట్లు కార్యమనఁగా గుండ లేక ప్రపంచమనియుఁ గారణమనఁగా మట్టిలేక బ్రహ్మమనియు మనమూహింపఁగలము. మట్టితో నొక రూపముగఁ జేసినదానికిఁ గుండయని పేరిడితిమి కాని నిజమున కది మట్టియేకదా! అట్లే బంగారుతో నొక యాకారముగఁ జేసి దానికిఁ గడియమని పేరిడితిమి. అదియు రూపమందును, నామమునందును భేదముగలదు కాని బంగారమున కేమైనను భేదముగలదా! లేదు. రూపము ప్రయోజనముకొఱకును నామము వ్యవహారముకొఱకును నేర్పడినవని మన కెల్లరకుఁ దెలసిన విషయమే కదా! కాఁబట్టి కుండ చేసినమట్టియుఁ గడియము చేసిన బంగారమునుమాత్రమే సత్యములైనవి. కావున నిజమునకుఁ గార్యమునకంటెఁ గారణము వేఱైనది కాదు. వికారము నశించుటకే కార్యనాశన మనిపేరు. అట్లగునపుడు కారణము శేషించియుండును. కార్యమెప్పుడును గారణములోనే లయించుచుండును. ఈవిధముగ విమర్శించుకొనుచుఁ బోయినను సకలభువనములును, జతుర్విధజంతుశరీరములును, సకలస్థూలప్రపంచమును, బంచీకృత మహాభూతములకంటె వేఱుగానేరవు. అట్లే ప్రాణుల సూక్ష్మశరీరములును, అపంచీకృత భూతసూక్ష్మములకంటె వేఱు కానేరవు. పృథ్వీతత్త్వము జలతత్త్వమునకంటెను, జలతత్త్వమగ్నితత్త్వము కంటెను, అగ్నితత్త్వము వాయుతత్త్వమున కంటెను, వాయుతత్త్వ మాకాశతత్త్వమునకంటెను వేఱుగావు. ఆయాకాశమును త్రిగుణాత్మకమగు మాయకంటెను భిన్నమయినదికాదు. ఆమాయయు నీశ్వరచైతన్యమును నధిష్ఠానమగు శుద్ధచైతన్యమునకంటె వేఱుకానేరవు. ఇవ్విధముగాఁ జూచినను బ్రపంచము బ్రహ్మమునకంటె వేఱైనదా! కాదు! కాఁబట్టి యధ్యారోపమునుబట్టి చూచినను, నపవాదమునుబట్టి చూచినను నిజమగువస్తువు బ్రహ్మమేకాని దానికంటె వేఱైన మఱియొకవస్తువు లేదు కావున బ్రహ్మమునుగూర్చి తెలిసికొనినయెడల సర్వమును దెలిసికొనినట్లే యగును. ప్రపంచమును రజ్జుసర్పములవంటిదే కాని నిజమైనదికాదు.

ఇంకఁ నాబ్రహ్మ మెవఁడో తెలిసికొందము. ఎవఁడో కాఁడు. జీవుఁడే యాబ్రహ్మము. అతఁడు బ్రహ్మమునకుఁ బరుఁడు కాని, సజాతీయుఁడు కాని కాఁడు. జీవునకును బ్రహ్మమునకుఁ గలిగిన యైక్యము స్వరూపైక్యమే కాని వేఱు కాదు. తత్త్వమస్యాది మహావాక్యముల కర్థమిదియే. దీనికే యఖండైకబోధ మందురు. సకలసంసారోచ్ఛేదియు, మోక్షదాయియు నగుఁ దత్త్వజ్ఞానమిదియే దీనికొఱకే ఋష్యాదులు కర్మయోగము మొదలగు సాధనములను జాలకాలమభ్యసించిరి. అజ్ఞానము నెల్ల ననుభవమునకుఁ దెచ్చికొనిరి. అందుచేత నేకదా వారెల్లరును గృతార్థులైరి. ఇట్లు చెప్పెడి జీవబ్రహ్మైక్యమే వేదాంత శాస్త్రమున కంతకును ముఖ్యమగు విషయము. ఇత్పటికి నీవిధముగా జీవుఁడు సాక్షాద్బ్రహ్మమేయని తేలినది. యీవిషయమే (జీవబ్రహ్మైక్యమే) యుపనిషత్తులందధికముగా బోధింపఁబడినది. శంకరులును దమ సూత్రభాష్యమునం దీ విషయమును జక్కఁగా నిరూపించిరి. ఇట్లు చెప్పెడి శ్రుతులకు ద్వైతులుగాని, విశిష్టాద్వైతులుగాని తమతమ మతానుకూలముగాఁ జెప్పినయర్థము లెట్టివని పాక్షికములేక చూచిన నద్వైతులు చెప్పెడియర్థములే బాగుండునని తోఁచును.

ఇఁక జీవునకు నీశ్వరునకు భేదమెట్లు చెప్పిరో చూతము. జీవునకెట్లు పాధి (శరీరము) కలదో యట్లే యీశ్వరునకుఁగూడను పాధిగలదు. పరమార్థదశయం దిద్దఱకును భేదమేమియును లేకుండినను వ్యవహారదశయందు మాత్రము విశేష తారతమ్యముగలదు. అది యెట్లనఁగా:—అతఁడు సర్వజ్ఞుఁడు; ఇతఁడు కించిజ్ఞుఁడు. అతఁడు సర్వవ్యాపి; ఇతఁడు పరిచ్ఛిన్నుఁడు. అతనియెడ నావరణశక్తి యెంత మాత్రమును బనిచేయఁజాలదు; ఇతనియెడ సంపూర్ణముగాఁ బనిచేయును. అతఁడెంత సృజియించుచున్నను గర్త కాఁడు; ఇతఁడే కర్త. అతఁ డుపాసింపఁదగినవాఁడు; ఇతఁడుపాసనము చేయువాఁడు. అతఁడు వారివారి కర్మములనుబట్టి ఫలమిచ్చుచుండును; ఇతఁడు వాని

ననుభవించుచుండును. అతఁడు మాయను లోఁబఱచుకొని స్వమహిమయందే యెప్పుడునుండును; ఇతఁడు తాను నిత్యుఁడు నిర్వికారుఁడు నైన బ్రహ్మమేయని తెలిసికొనక మాయావశుఁడును, దేహాభిమానియు నగుటయేకాక తానేకర్తననియు,భోక్తననియు, సుఖిననియు, దుఃఖిననియు భ్రాంతిచెంది పెక్కుడుముల కావాసమగు నీ సంసారములోఁ దగుల్కొని భ్రమించుచుండును. పైని చెప్పఁబడినట్లుగా జీవేశ్వరులకు భేదములేదనునపుడు కొందఱీశ్వరుఁడు తనకుఁదానే యట్టి సంసారమును గల్పించుకొననేలయని పరిహాసింతురు. అట్టివారలకు వ్యవహారదశాభేదముగాని, పరమార్థదశాభేదముగాని తెలియదని యనుకొనవలసివచ్చును.

ఇఁక నద్వైతులందుఁగల భేదములెవ్వియో కొంచెముగాఁదెలిసికొందము. పై సంగతులనుబట్టి జీవునకును నీశ్వరునకును గలభేదముపాధివలనఁగలిగినదని తెలిసినదికదా! అద్వైతులలోఁగొందఱు మాయయనఁగా నీశ్వరుని యుపాధియనియు, నవిద్యయనఁగా జీవునియొక్కయుపాధియనియుఁ జెప్పిరి. మఱికొందఱు మాయయనఁగా మఱియొకటియేదియును గాదు. మూలప్రకృతికే మాయయని పేరువచ్చెననియు, అట్టిదానియొక్క విక్షేపశక్తి యొక్కయు, ఆవరణశక్తి యొక్కయు నంశమే యవిద్య యనియు ననుచున్నారు. వేఱొకకొందఱు మాయయనఁగా శుద్ధసత్త్వమే ప్రధానముగాఁగల మూలప్రకృతియేయనియు, నవిద్యయనఁగా మలినసత్త్వమే ప్రధానముగాఁగల యవిద్యయనియు ననుచున్నారు. ఇఁకఁ గొందఱు విక్షేపశక్తియే ప్రధానమైన మూలప్రకృతి మాయయనియు, ఆవరణశక్తిప్రధానమైన దవిద్యయనియు వచించిరి. సర్వజ్ఞముని యీమాయావిద్యలకు లక్షణమేమియుఁ జెప్పక యీశ్వరుని యుపాధి యవిద్యయనియు, జీవుని యుపాధియంతఃకరణమనియు మాత్రము చెప్పెను. మొత్తమునకుఁ బైని చెప్పఁబడిన వారందఱు నాయాయుపాధులందుఁ బ్రతిఫలించిన శుద్ధచైతన్యమే జీవే

శ్వరులని చెప్పిరి. వివరణకారులు మాత్రము మూలభూతమగు నజ్ఞానమునం దెట్టిభేదములను జెప్పక దానిని జీవమున కుపాధియగునవిద్యయని చెప్పుచు, నందుఁ బ్రతిఫలించెడి చైతన్యము జీవుఁడనియు, బింబభూతమగు చైతన్య మీశ్వరుఁడనియుఁ జెప్పిరి. ఇదియే జీవుఁడు ప్రతిబింబమనువారల మతము. ఇఁక వాచస్పతిమిశ్రు లేమనిరో చూడఁజనదా! అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమే జీవుఁడనియు, అట్లు కానిది యీశ్వరుఁడనియు నిర్ధరించిరి. ఇట్టివియేకాక మఱికొందఱజ్ఞానము సమష్టిరూపమగునపు డీశ్వరోపాధి యగుననియు, వ్యష్టిరూపమగునపుడు జీవోపాధి యనియుఁ జెప్పుదురు. ఇట్లే మఱికొందఱ మతమునం దీశ్వరుఁడనువాఁడు ప్రత్యేకముగా లేఁడు. బ్రహ్మమే యవిద్యవలన జీవభావమునంది యీప్రపంచము నేకాక యీశ్వరునిఁ గూడ కల్పనముచేసికొని సుఖదుఃఖరూపమగు సంసారానుభవము నొందుచున్నదనియుఁ గలదు. ఇక్కడఁ మనకుఁ దేలినఫలితార్థ మేమి? ఎందైనను జీవునకును నీశ్వరునకును భేద ముపాధివలనఁ గలిగిన దని ఫలితార్థము.

ఇంక జీవులలోని పరస్పరభేద మెట్టిదో చూతము. జీవునకు నీశ్వరునకు భేద ముపాధివలనఁ గలిగినట్లుగా జీవులందు నుండెడి పరస్పర భేదముగూడ నుపాధివలనఁ గలిగినదేకాని నిజమైనదికాదని చెప్పుదురు. దీనినొకవిధముగా నిర్ధరింపవచ్చును. ఎట్లందురా? నిజముగా సకలప్రాణులందుండెడి యాత్మము పరమాత్మస్వరూపమైనదేకదా! అట్టిపరమాత్ముఁడొకఁడా! పెక్కండ్రుగలరా! ఒక్కఁడేకదా! అందువలన జీవులందఱలోని పరస్పరభేదమిప్పు డుపాధిభేదమువలననే గలుగుచున్నదని తెల్లమగునుగదా! అట్టుపాధిభేదముయినపుడు సుఖమువలనఁ

గాని దుఃఖమువలనఁగాని కలిగెడు ఫలితము మాత్రమెవరిది వారికిఁ గాక యొకరిది మఱియొకరికెట్లగును! ఇది యిట్లుండనిండు! ఉపాధి సంబంధమును బోఁగొట్టుకొనిన జీవుఁడు ముక్తుఁడగుటయు, అట్లు కాకుండినపు డెప్పటియట్లు సంసారబద్ధుఁడై యుండుటయు సంభ వించును.

ఇఁక జీవునియొక్క యుపాధియన నేమి? అందేమైనను భేదము లున్నవాయనెడి సంగతులనెత్తి యెట్లుచెప్పిరో చూడవలసియున్నది. ఉపాధియనఁగా మఱేమియునుగాదు; శరీరమే! అది స్థూలమనియు, సూక్ష్మమనియుఁ, గారణమనియు మూఁడు విధములుగాఁ బరిగణింపఁ బడుటయేకాక యన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయా నందమయములనెడి పంచకోశములు గలదిగఁగూడఁ బరిగణింపఁబడు చున్నది. జనన మరణ ధర్మములుగల యీస్థూలశరీరమన నేమియో మనకెల్లరకుఁ దెలిసినవిషయమే. ఇది తల్లిదండ్రుల శుక్లశోణితముల మూలముగాఁ బుట్టుటయేకాక మరణధర్మముగలిగి నశించిపోవునది కూడ నిదియే. దీనినే యన్నమయకోశమందురు. అనఁగా నీశరీరము తల్లి దండ్రులు తినిన యన్నవికారమగు శుక్లశోణితములవలనఁ గలిగినది. అట్లు కలుగుటయేకాదు. అన్నమువలననే వృద్ధిసందుచున్నది. అది లేకుండిన నశించును. కాన యన్నవికారమయినదగుటచే నన్నమయ మనియుఁ గత్తికొఱవలె నాత్మకిది యాచ్ఛాదనమగుటవలనఁ గోశ మనియు ననఁబడుచున్నదని యర్థము. మఱియు నాత్మము నవద్వార ములుగల దేహమనెడి సౌధమునందుండి మహారాజువలె విషయోప భోగము లనుభవించుచున్నాఁడు.

మఱియు నాత్మ్మ(డు లోననుండి వెలుపటి శబ్దాది విషయములను దెలిసికొనుటచేత దీనికి (స్థూలశరీరమునకు) స్థూలభోగాయతనమను నామమును జెల్లుచున్నది.

ఇక సూక్ష్మశరీరమన(గా నేమియోవిచారింతము:—చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు—ననెడి జ్ఞానేంద్రియములైదును; వాక్కు, హస్తము, పాదము, వాయువు, గుహ్యముననెడి కర్మేంద్రియములైదును; ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము ననెడి ప్రాణములైదును, మనస్సును, బుద్ధియునను నీరెండును మొత్తమీ పదునేడవయవములు గలసినదానికి సూక్ష్మశరీరమనిపేరు. దీనికే లింగశరీరమను నామాంతరమునుగలదు. అన(గా "లీనమర్థం గమయతీతి లింగమ్" అనెడి వ్యుత్పత్తిని(బట్టి దా(గియున్న విషయమును బయలుపఱచునదియగుటచే లింగశరీరమనెడి పేరువచ్చెనని యర్థము. దా(గియున్న విషయమేదియని ప్రశ్నింతురా? "సూక్ష్మశరీరరూపమగు గుహయందుండెడి పరబ్రహ్మము నెవ్వ(డెఱు(గునో" యనెడి "యో వేదని హితంగుహాయాం" యను శ్రుతిప్రమాణమును బట్టి సూక్ష్మశరీరమునందున్నది పరబ్రహ్మమేకదా! ఈ సూక్ష్మశరీరమునకే ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములనెడి మూ(డు కోశములునుగలవు. ప్రాణమయ కోశమన(గా ప్రాణాది వాయువు లైదును, వాగాది కర్మేంద్రియములైదును గలసియున్నదని యర్థము. ఎందుచేతనన(గా నిందు( గర్మేంద్రియములు ప్రాణసాహాయ్యము లేక ప్రవర్తింప(జాలవు కావున ముఖ్యమైన ప్రాణమునుబట్టి యట్టిపేరు వచ్చినది.

మఱియు( బ్రాగ్గమనముచేత( బ్రాణమనియు, నవాగ్గమనము చేత నపానమనియు, విష్వగ్గమనముచేత వ్యానమనియు, నుత్క్రమణముచేత నుదానమనియు; భుజించిన పదార్థములను సమీకరించుటచే సమానమనియు( బేళ్లు వచ్చెనని కొందఱు చెప్పుదురు. పైని

చెప్పఁబడిన స్థూలశరీరమునకుఁ జలనమీప్రాణమయకోశమువలననే కలుగుచున్నది. జ్ఞానేంద్రియములతోఁ గూడిన మనస్సునకే మనోమయకోశ మనిపేరు. చింతావిషాదాదులు మనోధర్మము లగుటచే మనుజుఁడీమనస్సుతోడనే సంకల్పించును. కార్యమునకై యత్నించును. ఫల మనుభవింపఁజూచును. అందుచే మన మేమనుకొనవలయును? మనస్సే సర్వకారణమై దని యనుకొనవలయును. అనఁగా మనకుఁ దేలిన ఫలితార్థమేమి! అది సంకల్పాదులకే కాక లోన వెలుపల నుండెడివానిని దెలిసికొనుటకేకాక చూచుట, వినుట, మూఁచూచుట లోనైన కార్యములను జేయుటకుఁగూడఁ గారణమైనది. అట్లగునపుడు బంధమునకుఁగాని, మోక్షమునకుఁ గాని, యిష్టానిష్టములకుఁ గాని యదియే యేల కారణము కాకుండును! ఇప్పటికిఁ బ్రాణమయకోశ మనఁగా నేమియో తేలినది. ఇఁక విజ్ఞానమయకోశమనఁగా నేమియో కనుఁగొందము. జ్ఞానేంద్రియములతోడఁ గూడియుండిన బుద్ధియే విజ్ఞానమయకోశ మనఁబడుచున్నది. ఇదియే విజ్ఞానాధిక్యముచేత నాత్మన కాచ్ఛాదకమైనది. ఇదియే యహంకారవృత్తికలది! ఇదియే సర్వమును దనదే యనెడియాస పుట్టించునది! పైని చెప్పఁబడిన గ్రంథమునుబట్టి యిప్పటికి స్థూలశరీరమనఁగా నేమియో సూక్ష్మశరీరమనఁగా నేమియో యొకింత తెలిసియుండవచ్చునుగదా! ఇప్పుడు మనము జన్మమనఁగా నేమియో మరణమనఁగా నేమియో విచారింపఁగలిగితిమా. చక్కఁగా బోధపడఁగలదు. జన్మమనఁగా లింగశరీరమునకు స్థూలశరీరముతోడి సంబంధము కలుగుటయే. ఆ రెంటికి నట్టిసంబంధము విడిపోవుటయే మరణము. మఱియుఁ బ్రతిజన్మమునందును మనుజునకయ్యెడి యనుభవములెల్ల సంస్కారరూపముగా లింగశరీరమునందు దాఁగియుండి ప్రారబ్ధమునుబట్టి బయలుపడుచుండును; ఆఁకలి దప్పిలోనగునవియెల్లను నీశరీరధర్మములే.

ఇఁక గారణశరీరమనఁగా నేమియో పరికింతము. ఈ కారణోపాధికే యానందమయ కోశమనెడి పేరును గలదు. "నేనేమియు

నెఱుఁగనివాఁడను; నాకేమియుఁ దెలియదు ” అని చెప్పెడి యవిద్య (అజ్ఞానము) యేకారణశరీరము. అనఁగా స్థూల సూక్ష్మశరీరముల యుత్పత్తికిఁ గారణమైనదియు, నాద్యంతములు లేనిదియుఁ గలదనికాని లేదనికాని నిర్ణయించుటకు వలనుపడనిదియు, “జీవబ్రహ్మములొక్కటియే. ప్రతిబింబమునకును బింబమునకును భేదములేదు” అనెడి యభేద జ్ఞానము కలుగనియెడల నశింపనిదియు నగు మూలాజ్ఞానమే కారణ శరీరమనఁబడుచున్నది. మఱియుఁ గొందఱిట్లు చెప్పుటయుఁగలదు:— అహంకారమువలననేకదా యాత్మునికి జీవత్వము సంభవించునది! కాన యట్టిదానికిఁ గారణమగుటచేతనే కారణశరీరమనఁబడుచున్నది. ఇఁక నిది యానందమయకోశ మెట్లయ్యెనో చూతము:—ఆత్మస్వరూపమును గప్పిపుచ్చుటచేతను విశేషానందముకలది యాటచేతను నీ కారణశరీర మానందమయ కోశమనఁబడుచున్నది. అట్టి యానందాతిశయమెట్లు కలిగియున్నదందురా! వినుఁడి! నిద్రావస్థయందే కదా యానందాతిశయము గలుగునది. సాధారణముగా మనము నిదుర నుండి మేల్కాంచినపు డేమందుము. “ఎంతసుఖముగా నిద్రించితిమి. మఱేమియు నెఱుగము” అని యందుముకదా! కాఁబట్టి మన యనుభవమువలననే నిద్రావస్థయం దానంద మధికముగానున్నదని తేఁటపడుచున్నది.

ఇఁక నీశరీరములెట్టివి, జీవుఁడు వీనియందెట్టి యభిమానము గలవాఁడను సంగతులను బరామర్శింపఁబోదము :—స్థూల, సూక్ష్మ, కారణములని వ్యవహరింపఁబడెడి యీ మూఁడు శరీరములునుగూడ జడములే. జీవాత్ముఁడన్ననో వానికి విలక్షణుఁడును జిత్స్వరూపము గలవాఁడునునై యున్నాఁడు. అట్టివాఁడయ్యును నాతనికది తెలియుట లేదు. జీవభావముమాత్రము కల్పింపఁబడుచున్నది. జీవభావమనఁగా మూఁడు శరీరములునుగూడ నేనేయనుకొనుట. దీనికే తాదాత్మ్యాభిమానమనిపేరు. అందుచేతఁ గారణశరీరమును నేనేయని యనుకొనినపుడు “నేనజ్ఞుఁడనని” తలఁపవలసి వచ్చుచున్నది. అట్లే లింగ

ఇఁక జీవునకున్న ట్లీశ్వరునకుఁగూడ నుపాధిత్రయమున్నదా ? లేదా? ఉన్న నెట్లున్నదని విచారింతము. ఈశ్వరునకు మాయయే కారణశరీరము. సకలజీవుల లింగశరీరసముదాయమే లింగశరీరము, సకలస్థూలప్రపంచమే స్థూలశరీరము. మఱియు జీవునకుఁ దైజసాది నామము లుండియున్నట్లె యీశ్వరునకుఁగూడ హిరణ్యగర్భుఁడు లేక సూత్రాత్ముఁడు, విరాట్టు ననునామములుగలవు. కాన యాతఁడెప్పు డెప్పు డేయేనామములతో వ్యవహరింపఁబడుచుండునో చూతము. ఈవిషయము తెలిసికొనుటకు ముందుగా సమష్టియనఁగా నేమియో వ్యష్టియనఁగా నేమియో వివరముగాఁ దెలిసికొనవలయును: అప్పుడు గాని జీవేశ్వరుల యుపాధు లిట్టివని తెలియరాదు. సమష్టియనఁగా మొత్తమనియర్థము.వ్యష్టియనఁగా నొంటరితనమని కాని లేక ఒంటిపాటని కానియర్థము. ఈయర్థమును మనకొక దృష్టాంతముచే చక్కగాబోధపడును చెట్లనేకముగా నొకచోట నుండినపు డట్టిచోటు నేమందుము? వనమందుము. అట్లుకాక యొక్కటియున్నపు డేమందుము ? వృక్షమందుము. కావున మనకుఁ దేలిన ఫలితార్థమేమి ? ఒక్కదానినిగూర్చి మాత్రమే తెలియఁజేయుదాని కేకత్వవ్యవహార మనియు, నట్లే ననేకమునుగూర్చి యనఁగాఁ బెక్కింటినిగూర్చి చేయు వ్యవహార మనేకత్వమనియుఁ జెప్పఁబడుచున్నది. ఇచ్చట నేకత్వవ్యవహారము జీవుని గూర్చి తెలుపును. అనేకత్వ వ్యవహార మీశ్వరుని గూర్చి బోధించును. ఎట్లందురా ! ప్రత్యేకముగా స్థూల సూక్ష్మకారణములలో నెద్దియైన నొకటి గలిగియుండువాఁడు జీవుఁడు, అట్టిజీవులకుండెడి స్థూలశరీరములన్నియు నీశ్వరునికి స్థూలశరీరమగును. ఇట్లే యంతటను జూచుకొనునది. ఇఁకను హిరణ్యగర్భాదిశబ్దముల నెత్తి చూతము:—హిరణ్మయమగు ననఁగాఁ బ్రకాశరూపమగు బుద్ధియందు హిరణ్యము (బంగారు) వలెఁ బ్రకాశించువాఁ డగుటచే నీ సమష్టిలింగ శరీరాభిమానియగు నీశ్వరునకు హిరణ్యగర్భుఁడను వ్యవహారముకలదు. అట్లే మణిపంక్తులలో దారముండినట్లు సమస్తలింగదేహములందును

ఇఁకఁ బురుషార్థమునకుఁగాని జ్ఞానము వ్యర్థమైనదేయగుట వలన శంకరులాజ్ఞానము నెట్లుబోధించిరో చూతము:— ఈ లోకము నందలి స్థితిగతులెంత గొప్పవైన నపేక్షింపఁదగినవి కావనియు, నీజన్మము జాతమాయనర్థములతోడనే నిండియున్నదనియు, సుఖమనునది యున్నట్లుగాఁ గాన్పించుటయేకాని దుఃఖమే యత్యధికముగా నున్నదనియు, జన్మాంతరమునందు జీవునకు లభింపఁదగిన యుత్తమస్థితియగు మోక్షమొక్కటి యున్నదనియు, నది యీలోకమునందలి సకల పదార్థములను దిరస్కరించినఁగాని లభింపదనియు, దేహమునకంటె నాత్మమే యధికమైనదని యెంచువారెల్లరును దలంచుచున్నారు. కాని వీరలలోఁగూడను గొన్నిభేదములు గాన్పించుచున్నవి. అవి యెవ్వియో కాదు! ఈపుట్టువునందలి దోషమెద్ది? సకలానర్థకములకుఁగాని, దుఃఖములకుఁగాని కారణమేమైయుండును? వీనినెట్లు పాపుకొనఁనగును? మోక్షమునందు మార్గమెద్ది? అనువానిలో మాత్రము తలయొక తీరుగాఁబోయిరి. అందు ముఖ్యముగా మనయాచార్యులు చూపిన మార్గమునుబట్టికదా! మనమిప్పుడు పోవలయును! రోగ మొక్కటి యైనపుడు మందు వేఱొకటివేసిన నయముకానట్లే యీ సంసారమను రోగమునకు సరియగుమందు లభింపనపుడది యెట్లునివర్తించును? దాని తత్త్వమునుగనిపెట్టి శ్రీ యాచార్యులద్వైతామృతము నొసఁగిరి. అదిసేవించిన వారలకు సంసారభీతి యెక్కడిది! మఱియు శ్రీవారి జన్మమందలి సకలానర్థకములకు దేనిని మూలకారణమనిరో చూతము. అధ్యాసములై సకలానర్థకములకుఁ గారణమనిరి. ఈయధ్యాస మజ్ఞానమువలనఁ బుట్టుచున్నది. కావున యథార్థజ్ఞానము కలుగుటచే నది నశించి మోక్షప్రాప్తియగునని చెప్పిరి. ఇంతమాత్రము నాయర్థము స్పష్టపడుటలేదు కాన కొంచెము వివరముగాఁ దెలిసికొందము. మనుజులకీ ప్రపంచమందలి సుఖ దుఃఖములు యధ్యాసమువలననే కలుగుచున్నవి. అది యెట్లని తెలిసికొనుటకు ముందుగా నధ్యాసమన నేమియో తెలిసికొందము.

ఒకవస్తువును జూచి వేఱొకవస్తువనుకొనుటకే యధ్యాసమని పేరు. అది యెట్లనఁగా నొకానొకప్పు డొకతగరపుముక్కను జూచి నంతనే మన మేమనుకొందుము? అది నిజముగా వెండియే యనుకొందుము. అది నిజముగా వెండియా! కాదు! తగరపుముక్కయేకదా! అట్లే యొకత్రాఁటినిఁ జూచి పామనుకొందుము. అది పామా? కాదు. నిజమునకుఁద్రాఁడేకదా! ఒక మొద్దునుజూచిమనుజుఁడని యనుకొందుము నిజమునకది మొద్దా! మనుజుఁడా! మొద్దేకదా! కాన తగరపుముక్క లోనగువానిని జూచి వెండిమొదలగునవి యని యనుకొనుట కధ్యాస మని తేలినది. అందుచే నీయధ్యాసము కలుగుటకుఁ గారణమగున దేది! అజ్ఞానమేకదా కారణము. ఏవస్తువును జూచినంతనే మనకా యధ్యాసము కలిగినదో దాని కధిష్ఠాన మనిపేరు. అనఁగా నధ్యాసముకలిగించెడి వస్తువున కధిష్ఠానమనిపేరు. కాన సర్పాధ్యాసకు త్రాఁడును, రజతాధ్యాసకుఁ దగరమును నధిష్ఠానములయ్యెను. అట్టి యధిష్ఠానవిషయము బాగుగాఁ దెలిసికొనినపు డధ్యాస మెక్కడిది! అనఁగా నిది త్రాఁడేయని తెలిసికొనినపుడు సర్పమనెడి యభిప్రాయ ముండదని యర్థము.

ఇఁకఁ బైనిచెప్పబడినట్లధ్యాసమే సుఖదుఃఖములకుఁ గారణ మెట్లయ్యెనో చూతము! లోకములోఁ గొన్నివస్తువులను జూచిన వెంటనే సంతోషమును, మఱికొన్ని వస్తువులను జూచినంతనే భయాదులును గలుగుచున్నవికదా! అనఁగా వెండికాని తగరపుముక్కను జూచి యజ్ఞానముచే నిజముగా వెండియనియే యనుకొని "మనకు వెండి దొరకినదని" యానందించుచున్నారము. అట్లే నిజమునకుఁ బాముకాని త్రాఁటినిఁజూచినపుడు పామేయని భయపడుచున్నారమని యర్థము. అట్లు వెండియనెడి యానందమునకును, బామనెడి భీతికిని గారణమైనది యజ్ఞానమువలనఁ గలిగిన యధ్యాసమేయని ధృవమగుచున్నది. ఆవిధముగనే యాత్మముకానట్టి యింద్రియాదుల నాత్మ యనుకొనుటయు, ఇంద్రియధర్మములం దాత్మధర్మముల నారోపించు

కొనుటయు, దేహసంబంధమువలనఁ గలిగిన పుత్రమిత్రాదులు నావా రని యనుకొనుటచేఁగూడ సుఖ దుఃఖములు పొడముచుండును. అందుచే నా సుఖ దుఃఖాదుల యధిష్ఠానమును బాగుగాఁ దెలిసికొని నంతనే యవి యెట్లునివర్తింపకుండునో! ఏది యెట్లుబోధించిన నధ్యాస రూపమగు దోషమువలననే యాత్మునికి సంసారరూపమగు బంధము ప్రాప్తించినది. దానివలన గర్భవాసము, జన్మము, మరణము, కష్టము, భయములోనగు వానిచే నాతఁడెప్పుడును క్లేశపడుచున్నాఁడు. సర్వా నర్థములకుఁ గారణమగు నధ్యాసము నివర్తింపఁగా బంధమెక్కడిది! దీనికి ఫలితార్థమేమనఁగాఁ బ్రపంచాసక్తియే బంధమనియు దాని నివృత్తియే మోక్షమనియు గ్రహింపనగును. ఇక్కడకు నజ్ఞానముచే నధ్యాసము కలుగుచున్నదని తేటపడినదికదా!

ఇఁకనది యెట్లునివర్తించునో చూతము:—ఇది త్రాఁడేకాని పాముకాదని తెలిసినవాఁడు త్రాఁటినిఁద్రొక్కి పామను భ్రాంతిఁజెంది భయకంపాదుల నందువానికి నాత్రాఁటినెత్తిచూపి "నాయనా! ఇదిగో! చూడుము! ఇది త్రాఁడేకాని పాముకాదు! వ్యర్థముగా భయకంపాదులను గలిగించుకొనుచున్నవాఁడవు. అన్ని చెప్పినపిదప నిశ్చయజ్ఞానము కలుగుటవలన భయకంపాదులు లేకుండునో యట్లే బ్రహ్మమే సత్యమైనది, జగము మిథ్యయైనది! జీవుఁడే బ్రహ్మముకాని యన్యుఁడుగాఁడను నిశ్చయజ్ఞానము కలిగినంతనే యజ్ఞానమునశించును. దేహాదులందున్న యధ్యాసము వదలిపోవును. అంత సర్వానర్థములు తొలఁగిపోవును. మరలఁ బుట్టువు లేకుండును! మోక్షము సిద్ధించును. బ్రహ్మభావమే మోక్షముకదా! అనఁగా బ్రహ్మజ్ఞానమువలన జీవభావము వదలిపోయి బ్రహ్మభావమేర్పడును. ఇదియే యద్వైత సిద్ధాంతము. ఇక్కడకు మనకుఁదేలిన ఫలితార్థమేమి? ఏవిధముగఁజూచినను మరలఁ బుట్టుక లేక యుండుటయే మేలైనసంగతియనియు, నది బ్రహ్మజ్ఞానమువలననేకాని మఱొకదానివలన సంభవింపదనియుఁ దేలినది. అట్టిది పరోక్షజ్ఞానమనియు, నపరోక్షజ్ఞానమనియు ద్వివిధముగానున్నది.

పరోక్షజ్ఞానమనఁగా గ్రంథములవలనఁగాని, యన్యులు బోధించుటవలనఁ గాని జీవుఁడును బ్రహ్మమును నొకటియేకాని వేఱుకాదని తెలిసికొనుట. ఇఁక నపరోక్షజ్ఞానమనఁగా నేమియో విచారింతము! అధ్యాసమును వదలవలయును. జీవభావమును విడువవలయును. శరీరత్రయసాక్షి కావలయును. ఇట్లయి యఖండైక బ్రహ్మాత్మానుభవము నొందుటయే యపరోక్షజ్ఞాన మనిపించుకొనును. మోక్షము సిద్ధించుట కీయపరోక్షజ్ఞానమే ముఖ్యముగాని కేవల పరోక్షజ్ఞానమంత ముఖ్యముగాదు. ఎందుచేతనందురా! కేవల పరోక్షజ్ఞానము బంధనివృత్తి చేయఁజాలునా! చేయఁజాలదు. మనము దీనికొక దృష్టాంతమును జూడవచ్చును! చీఁకటిలోనుండి దీపము నెంతవర్ణించిన నాచీఁకటిపాయునా! పాయదు కదా! మఱి దేనివలన నాయంధకారముపోవును? దీపమును దెచ్చినఁగాని పాయదు. అట్లే పరోక్షాపరోక్షజ్ఞానముల కార్యకారిత్వము నెఱుఁగవలయును. అట్లయిన నిఁకఁ బరోక్షజ్ఞానమువలని ఫలమేమందురా! ఈపుట్టువునందే యది సంపూర్ణ ఫలమీయ లేకుండిన నద్వైతవాసనను గలిగించి యుత్తరజన్మములందు నభివృద్ధిగాంచి తత్త్వజ్ఞానము కలుగుటకుఁ గారణమగును. సరియే! ఇక్కడకుఁ బరోక్షాపరోక్షజ్ఞానములు కలుగుటవలని ఫలమేమియో తెలినది. ఇంక ముఖ్యమగు నపరోక్షజ్ఞానము కలుగుటకు మార్గమేదియో చూతము. చిత్తశుద్ధి లేక యున్ననది కలుగనేరదు. అంతఃకరణమునందు రజోగుణమును దమోగుణమును దగ్గించుకొనుచు సత్త్వగుణమునే వృద్ధిచేసికొనుచువచ్చినఁజిత్తశుద్ధికలుగుచుండును. ఇఁక నాసత్త్వరజస్తమోగుణములనఁగా నేమియో తెలిసికొందము:—సత్త్వరజస్తమో గుణములు మూఁడును బ్రకృతివలనఁ బుట్టినవి. ఇవియే యాత్మని దేహమునందు బంధించుచున్నవి. వాని సత్త్వగుణము నిర్మలమైనదగుటవలనఁ బ్రకాశింపఁజేయునది. ఉపద్రవములేనిది. "నేను సుఖవంతుఁడ" ననెడి క్షేత్రధర్మమైన సుఖము నాత్మునియం దారోపింపఁజేయునది. రజోగుణము రాగాత్మకమైనది. ఇది తృష్ణను ఆసంగమును బుట్టించి పురుషుని నిబ

లోక వరలోకములయందలి ఫలములగు కర్మములయం దాసక్తినిఁ బుట్టించును. తమోగుణ మజ్ఞానమువలనఁ గలుగుచున్నది. ఇదియే యవివేకమును గలిగించుచుఁ బ్రమాదము, ఆలస్యము, నిద్ర మొదలగు వానిచే బంధమును కలుగఁజేయును, మఱియు సత్త్వము సుఖము నందును, రజోగుణము కర్మమునందును దమోగుణము ప్రమాదము నందును నాశక్తిని బుట్టించును. ప్రమాదమనఁగాఁ జేయనలసిన దానిని జేయకపోవుట. ఆత్మమునకుఁ దెలివిగలుగుటకుఁ ద్రోవలగు శ్రోత్రము మొదలగు నింద్రియములన్నియుఁ బ్రకాశవంతములైనపుడు సత్త్వగుణము వృద్ధిగాంచిన దనుకొనవలయును. ప్రకాశమనఁగా నతఃకరణముయొక్క వృత్తి (పరిణామము). అదియేజ్ఞానము. రజోగుణము వృద్ధియైనపుడు లోభము, ప్రవృత్తి అనఁగాఁ బ్రయోజనము నుద్దేశింప కయే ప్రవర్తించుట. అశమము అనఁగా సంతోషము, అనురాగము మొదలగునవి కలుగుట, స్పృహయను నివి కలుగుచుండును, తమోగుణమధికమైనపు డవివేకాదులు గలుగును. ఇట్లే కొన్నివిశేషములు గలవు. అవియెల్ల భగవద్గీతయందలి పదునైదవ యధ్యాయమును గాంచిన తేటపడును. అట్లే యీ గుణత్రయమునుగూర్చి మఱికొన్ని విశేషములు పదునేడవ పదునెనిమిదవ యధ్యాయములందును గలవు.

అట్లయినచోఁ బైనిచెప్పఁబడినట్లుగా నాసత్త్వగుణమును వృద్ధి చేసికొనుటకు మార్గమేమైనను గలదా? కలదు. ఫలాపేక్షను వదలి సత్కర్మములను జేయవలయును. యోగాభ్యాసము చేయవలయును. ఈ రెంటిలోను యోగాభ్యాసమే ముఖ్యమైనదని చెప్పవచ్చును. ఈ విషయమును మఱొకచోట వివరింతును. సత్కర్మములన నెట్టివని ప్రశ్నించుకొందము. ఈశ్వరోపాసనము, వేదోక్తకర్మములు, ధర్మాచరణము మొదలగునవియే సత్కర్మములు. వీనికిఁగూడఁ జిత్తశుద్ధియే పరమప్రయోజనము. మొత్తముమీఁదఁ గర్మకాండమంతయు జ్ఞానమునకు హేతువగునని పెద్దలు చెప్పుదురు. అంతేకాక చిత్త మొక్క దానియందు నిలుచుటకుఁగూడఁ గారణమగుననియుఁ దలఁప

వచ్చును. వీనికే బహిరంగ సాధనములని పేరు. ఏధర్మములెట్లు చెప్పఁబడియున్నను మనుజులు చిత్తప్రసాదమునకు బ్రహ్మచర్యము, అహింస, భూతదయ, అవక్రత, వైతృష్ణము, శౌచము, డంబము లేమి, సత్యము, నిర్మమత, నిశ్చలత్వము, అభిమానవిసర్జనము ఈశ్వరధ్యానము, బ్రహ్మవిత్సహవాసము, జ్ఞాననిష్ఠ, సమత్వము, మానావమానాసక్తి, ఏకాంతశీలత, ముముక్షుత మొదలగువానికి ముఖ్యముగా నలవాటుపడి యుండవలయును. బ్రహ్మచర్యమనఁగా స్త్రీలు పురుషులనుగాని, పురుషులు స్త్రీలనుగాని తలఁచుకొనుటయు, జూచుటయు, గుణగణమును, గృత్యములను గొనియాడుటయుఁ జక్కఁగానున్నారని తలచుటయు, ముచ్చటపడుటయు, ముచ్చటించుటయు, సహవాసమును, సంబంధమునను నివి లేకుండుటయే అహింస యనఁగా మనోవాక్కాయములచే నేజంతువును బీడింపకుండుట. దయయనఁగాఁ దనవలె వాఙ్మనఃకాయములచేత సకల భూతముల యందుఁ గృపగల్గియుండుట. అవక్రత యనఁగా మనోవాక్కాయములయందేమియు భేదములేక యొక్కవిధముగానుండుట. వైతృష్ణ్యమనఁగా బ్రహ్మమొదలు స్థావరమువఱకు నుండెడి యనువిషయముల యందునుఁ గాకి రెట్టయందెట్టి యసహ్యముండునో యట్టి యసహ్యముండుట. శౌచమనఁగా నేమియో కొంచెము వివరముగాఁ దెలిసికొందము. బాహ్యమనియు నాభ్యంతరమనియు శౌచము ద్వివిధముగానున్నది. అందు మట్టితోడను, జలముతోడను జేసికొనెడి శుద్ధి బాహ్యశౌచమగును. అజ్ఞానమును దొలఁగఁ ద్రోయుటచేసగు మనశ్శుద్ధియే యాభ్యంతర శ్శౌచమనఁబడుచున్నది. అభ్యంతర శౌచము బాగుగానుండునపుడు బాహ్యశౌచ మనావశ్యకమని చెప్పుదురు. డంబములేమి (అదంభిత్వము) యనఁగా ధ్యానము పూజ మొదలగు వానియందాసక్తి లేక లోకులు "అబ్బా! ఇతడెంత పూజసేయును, ఎంత ధ్యానముచేయునని" యనుకొనునట్లుచేయుటకే డంబమందురు. అట్లు చేయకుండుటయే యదంభిత్వమగును. డంబమునకై పూజాదులు చేయ

కుంభుటయని తాత్పర్యము. సత్యమనఁగాఁ దాను గన్నులారఁజూచిన దానిని జెవులార వినినదానిమాత్రమే చెప్పుటయేకాక, బ్రహ్మమే సత్యమని చెప్పుటయునుసత్యమగును. నిర్మమతయనఁగా దేహాదులుగాని,కళత్రాదులుగానినావనుబుద్ధి లేకుండుట,దీనికిఫలము కైవల్యము.నిశ్చలత్వమనఁగా గురువచనములచేతను వేదాంతవచనములచేతను నిశ్చయింపఁబడినయర్థమునందుఁ దదేకవృత్తితో దృఢాభిప్రాయముగలిగియుండుట. అభిమానవిసర్జన మనఁగా విద్య, ఐశ్వర్యము, తపము, రూపము, గుణము, వర్ణము, ఆశ్రమము మొదలగువానివలనఁ గలిగిన యహంకారమును విడుచుటయే, ఈశ్వరధ్యానమనఁగా మనోవాక్కాయములచే విషయసంబంధమగు క్రియను విడిచి తనయాత్మను నెల్లపుడును జింతించుట. బ్రహ్మవిత్సహవాసమనఁగా నీడవలె నెల్లపుడును బ్రహ్మవాదులతోడ వసించియుండుట. జ్ఞాననిష్ఠయనఁగాఁ గర్మమునందాసక్తి లేక యెప్పుడును జ్ఞానశాస్త్రమునందుఁ జెప్పఁబడిన శ్రవణమననాదులందే యాసక్తికలిగియుండుట, సమత్వమనఁగా:— ధనకాంతాదులు లభించినపుడు సంతోషముగాని, జ్వరాది పీడలు కలిగినపుడు దుఃఖముగాని లేక సమత్వముగానుండుట. మానానాసక్తియనఁగా:—లోకులు నన్ను శ్రేష్ఠునిగను, బూజ్యునిగను దలఁచి పూజింతురుగాక యనెడి యాసక్తి లేకుండుట ఏకాంతశీలతయనఁగా సద్విచారమునకు జనసమ్మర్దము విఘ్నకరమని యెంచి యేకాకియై యొంటరిగానుండుట, ముముక్షుతయనఁగా:—నాకు సంసారబంధనిర్ముక్తి శీఘ్రముగాఁ గలుగుఁగాక ! యని దృఢబుద్ధితోనుండుట.

ఇఁకఁబైని చెప్పఁబడిన బహిరంగ సాధనములుకాక యంతరంగసాధనములునుగూడ నాలుగుగలవు. అవి నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమాది షట్కసంపత్తి ముముక్షుత్వమునునవియే. నిత్యానిత్య వస్తువివేకమనఁగా బ్రహ్మమొక్కటియే నిత్యమైనది, ఇతరమగునదియెల్ల ననిత్యమని తెలిసికొనుట. అది యెట్లనఁగా:— మట్టితోడఁ గుండచేయఁబడుచున్నది కావున మట్టి

కారణమును గుండకార్యమును నగుచున్నవి. ఆవిధముగాఁ గుండ చేయుటకుఁ బూర్వమునందుఁగాని కుండయున్నపుడుకాని, కుండ పగిలి పోయినతర్వాతఁగాని అనఁగా మూడుఁకాలములందునుగానఁబడునదేది? మట్టియేకదా! అదియే నిత్యమైనది. అందుచేతఁ గారణవస్తువు నిత్యమైనదనియుఁ, గార్యవస్తు వనిత్యమైనదనియుఁ దెలిసికొనవలయును. దీనివలనఁ దేలిన ఫలితార్థమేమి? మృత్తుయొక్క కార్యమైన కుండ యనిత్యమైనట్లుగాఁ బరబ్రహ్మముయొక్క కార్యమైన జగముకూడ ననిత్యమేయగునని ఫలితార్థము. ఇట్లే శ్రుతులమూలమునను, యుక్తులమూలమునను బరబ్రహ్మము నిత్యమనియు, జగమనిత్యమనియు వివేచించుటకే నిత్యానిత్యవస్తు వివేకమనఁబడును. ఇహాముత్ర ఫలభోగ విరాగమనఁగా స్వప్రపంచమందలి సర్వవిషయములందును, స్వర్గాది భోగములందును వాంఛలేకుండుట. వీనివలన సకలభోగములందు వైరాగ్యమేర్పడి మనస్సునకు నిర్వేదముకలుగును. అంత బుద్ధియు విషయములపైకిఁబోవుట చాలించును.

ఇక శమాది షట్కమనఁగా నేమియో విచారింతము:- శమమనఁగా మనోనిగ్రహము. అదియెట్లనఁగా శ్రవణము, మననము, నిధిధ్యాసయనెడి వానియందుఁదప్పఁ దక్కిన విషయముల పైకి మనస్సును బోనీకుండుట. ఇందుఁజెప్పఁబడిన శ్రవణమనఁగా నుపక్రమోపసంహారాది నిబంధనాదులనుబట్టి యుపనిషదర్థమును విచారించుట. మననమనఁగా వేదాంత వాక్యార్థములను యుక్తులతోడ సహితము నిశ్చయించుచు ననుచింతనము చేయుచుండుట. నిధిధ్యాసమును గూర్చి మాత్రము కొందఱు ద్వివిధముగాఁ జెప్పుచున్నారు. శ్రవణమననపరిపాకమువలనఁ గలిగెడి జ్ఞానమని కొందఱును, అట్లుకాక ధ్యానమేయని మఱికొందఱును జెప్పుచున్నారు. ఇక్కడకు శమమనఁగా నేమియో తేలినది. దమమనఁగా సకలవ్యవహారములనుండియుఁ ద్రిప్పినమనస్సును శ్రవణాదులపై నిలుపుట. ఉపరతియనఁగా సన్యాసమని కొందఱును, ఇంద్రియములను విషయములపైకిఁ బోనీక యాపుటయని

కొందఱును జెప్పుచున్నారు. తితిక్షయనఁగా శీతోష్ణాదులను సహించుట. సమాధానమనఁగా శ్రవణాదులయందు నిలుపఁబడి యున్న మనస్సు పూర్వసంస్కారముచే విషయముల పైకిఁబరుగిడు నెడల వానియందలి దోషాదులను విమర్శించి వైరాగ్యమును బుట్టించి మరల్పుట. శ్రద్ధయనఁగా గురువులయందును, వేదాంతవాక్యములందును నమ్మిక. ఈ విధముగా సాధింపఁబడిన బ్రహ్మజ్ఞానము కలవాఁడయ్యును బ్రారబ్ధశేషముండినచో దేహముండిన నుండవచ్చునుగాని వాని దశ విలక్షణముగా నుండును. అనఁగా నాతఁ డెల్లప్పుడును బ్రహ్మమే సత్యమని నిశ్చయజ్ఞానము కలిగియుండును. పెక్కు జన్మములనుండి విషయముల కలవాటుపడియున్న చిత్తము యోగాదులులేని దేస్వాధీనమై యుండదందురు. మఱియు జ్ఞానశాస్త్రమునందు సమాధి మొదలుగాగల కొన్ని విషయములు గలవు. ఇట్టివాని నెల్లఁ బాగుగా నేర్చిన మోక్షప్రాప్తి యగునే మోకాని పైపైమాటలు నాలుగెవ్వియో నేర్చికొని నంతనే మోక్షప్రాప్తియగునా? శ్రవణ మననాదులవలన జ్ఞానము కలుగవలయును. సమాధి మొదలగునవి యలవాటు చేసికొనవలయును. అద్వితీయమగు నాత్మానుభవము దృఢపడవలయును. అప్పుడుగాని పరోక్షజ్ఞానము కలుగనేరదు. అట్టిజ్ఞానము కలిగిన పిమ్మటఁగాని మోక్షముమాట చెప్పవలనుపడదు. అంతేకాని "యాత్మునికిఁ బుణ్యపాపములంటవు. అతఁ డద్వితీయుఁడు" ననెడి వెవ్వియో నాలుగు మాటలు నేర్చికొని యుపాసనాదికమును వదలినంతనే మోక్షప్రాప్తియగునా ? అద్వైతమత కర్తలట్లు చేయుమనిబోధించిరా ? మనుజులందఱొక్కవిధముగా నుండరనెడి విషయము వారికిఁ దెలియనిదియా! కాన వారికివారికిఁ దగినట్లు కర్మమును గొందఱకును, భక్తి కొందఱకును, మంత్రోపాసన కొందఱకును నియమించిరి. అట్టిభేదములుండుటకుఁ గారణ మేమందురా? పూర్వజన్మములనుండి వచ్చెడి వాసనావిశేషముచే సుజ్ఞాతయమునందలి భాగములవలనఁ జిత్తవృత్తులును భిన్నభిన్నములుగా నుండును. అట్లుకాకున్నఁ బైనిచెప్పఁబడినట్లు కొంద

ఱకుఁ గర్మమనిన నిష్టమును, గొందఱుపాసనాదికములనిన నిష్టమును నుండునా? అందఱకొక విధముగా భక్తియుండదేకాని, కర్మములందే కాని బుద్ధియేల యుండకుండును? కాన యాచార్యులు చూపిన మార్గమునుబట్టి పోవువారల కెన్నటికైనను మోక్షము ప్రాప్తించుట సిద్ధమే!

ఇంకను నద్వైతమతమును వివరముగాఁ దెలిసికొనుటకుభయ భాషలయందు నెన్నియో గ్రంథరాజములుగలవు. అవి వేదాంత విషయము నభ్యసింపఁగోరువారలకు మిగుల నుపయోగకరములుగా నుండును. గాన యుందుదాహరించుచున్నాఁడను.

మాండుక్యోపనిషత్తునకు గారికలు. ఇవి గౌడపాదాచార్యులచే రచియింపఁబడినవి. ఉత్తరగీతాభాష్యముకూడ నాయాచార్యులచేతనే చేయఁబడినది. సూత్రభాష్యము, గీతాభాష్యము, అపరోక్షానుభూతి, ఉపనిషద్భాష్యము, మొదలగునవి శంకరులచే రచియింపఁబడినవి. రత్నప్రభ. ఇది సూత్రభాష్యమునకుటీక. దీనికిఁ గర్త రామానందుఁడు. అట్లే సూత్రభాష్యమునకు ఆనందగిరిచే రచియింపఁబడిన న్యాయనిర్ణయమును, మధుసూదనసరస్వతిచే రచియింపఁబడిన కల్పలతయుఁ, బద్మపాదాచార్యులచే రచియింపఁబడిన పంచపాదికయు, వాచస్పతి మిశ్రునిచే రచియింపఁబడిన భామతియుననెడి కొన్ని టీకలుకలవు. ఆనందగిరిచే రచియింపఁబడిన గీతాభాష్యవివేచనమును, శంకరానందుఁడు, మధుసూదనుఁడు శ్రీధరుఁడునను వారలచేఁ జేయబడిన శంకరగీతాభాష్యటీకలును గలవు. సురేశ్వరాచార్యులు బృహదారణ్యకోపనిషద్వార్తికమునేకాక తైత్తిరీయోపనిషద్వార్తికమును గూడ రచియించిరి. వీరుచేసిన నైష్కర్మ్యసిద్ధి బ్రహ్మసిద్ధియనెడి మఱి రెండు గ్రంథములునుగలవు. అట్లే మధుసూదన సరస్వతి యద్వైతసిద్ధిని, శ్రీహర్ష మహాకవి ఖండనఖాద్యమును, సదానందయతి అద్వైతబ్రహ్మసిద్ధిని బ్రహ్మానందుఁడు గౌడబ్రహ్మానందీయమును, ధర్మరాజాధ్వరి వేదాంతపరిభాషను, అప్పయదీక్షితులు సిద్ధాంతలేశ సంగ్రహమును మధుసూదన సరస్వతి సిద్ధాంతబిందువును సర్వజ్ఞాత్మాచార్యులు సంక్షేప

శారీరకమును, విద్యారణ్యులు పంచదశి, జీవన్ముక్తివివేకము, అనుభూతి ప్రకాశము నను గ్రంథములను, సదానందయోగి వేదాంతసారమును, వాసుదేవయతి వాసుదేవమననమును, జగన్నాథకవి యద్వైతామృతమును, నృసింహాశ్రమి భేదధిక్కారమును, ప్రకాశానందుఁడు వేదాంతసిద్ధాంతముక్తావళిని, భారతీతీర్థుఁడు మహావాక్యదర్పణమును, మహావాక్యరత్నావళిని, శ్రీకృష్ణమిశ్రులు ప్రబోధచంద్రోదయమును, ఉమామహేశ్వరుఁ డద్వైతకల్పధేనువును, భట్టోజి దీక్షితుఁడును, మహాదేవసరస్వతియును నద్వైతకౌస్తుభమును, మధుసూదనసరస్వతి యద్వైతతత్త్వరక్షణమును, అఖండానందుఁ డద్వైతరత్నకోశమును రచియించిరి. ఆంధ్రమునందు దివాన్‌బహదూరు జగన్నాథరావుగారు లోనగువారలు చేసిన శంకరసూత్రభాష్యాదులు గలవు.

ఓమ్ తత్సత్.

---

## చందాదార్లు.

మ. రా. రా. దామెర్ల గున్నేశ్వరరావుగారు.
,, పి. శివరామయ్యగారు, కరణము, సత్యవరము.
,, చెదలవాడ కృష్ణయ్యగారు.
,, తాళ్ళూరి లక్ష్మయ్యగారు.
,, పిడుగు వేంకటలక్ష్మయ్యగారు.
,, శాస్త్రి సంపతిరావుగారు.
,, తోలేటి వ్యాసప్రసాదరావుగారు.
,, తోలేటి సీతారామయ్యగారు.
,, అళ్ళగడ్డ యెల్లంరాజుగారు.
,, దేవంభొట్ల వేంకటేశ్వర్లుగారు.
,, చెన్నాప్రగడ చెన్నయ్యగారు.
,, వేలగంటి సుందరశివరావుగారు.
,, వంకమామిడి లక్ష్మీనారాయణగారు.
,, కాజ వీరరాఘవయ్య, సీతారామయ్యగార్లు.
,, మందడపు వెంకటసుబ్బయ్యగారు.
,, దుర్గవఝపు వెంకటసుబ్బారావుగారు.
,, పిన్నంరాజు రామమూర్తిగారు.
,, నాగావఝుల వెంకటప్పయ్యగారు.
,, తోలేటి ప్రకాశరావుగారు.
,, వఝుల అప్పారావుగారు.
,, అత్తోటి వెంకటరత్నముగారు.
,, మందడపు బలరామయ్యగారు.
,, మణుగుల వేంకటసుబ్బారావుగారు.
,, కే. భగవంతరావుగారు, కొత్తూరు, బళ్లారి.
,, మోపర్తి వేంకటరమణయ్యగారు.
,, గోపరాజు సత్రాజుగారు.
,, సరిపెల్ల విశ్వేశ్వరప్రసాదరావుగారు.
,, తుట్టగంటి పెద భైరవమూర్తిగారు.
,, కోమారి విశ్వనాథశర్మగారు.
,, మల్లవరపు భానుమూర్తిగారు.
,, వరాహగిరి జోగయ్యపంతులుగారు.
,, దామెర్ల కామేశ్వరరావుగారు.
,, మాచిరాజు శివరామయ్యగారు.
,, బొల్లాప్రగడ వేంకటరత్నముగారు.

వీరే మొదటినుండియును నిప్పటివఱకును జేరినవారు.

# ప్రకటనము.

అయ్యా !

అద్వైతము, వాజసనేయిసంధ్య, యాజ్ఞవల్క్యచరిత్రము, యాజ్ఞవల్క్యస్మృతి, శుక్లయజుర్వేదము, శతపథబ్రాహ్మణము, జటాదివికృతులు లోనుగాఁగల గ్రంథములు వలయువారు ఈక్రింది విలాసమునకు వ్రాసికొనఁగోరుచున్నారము.

భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు,
యాజ్ఞవల్క్యపత్రికాస్థానము,
మాచర్లపేట,
గుంటూరుజిల్లా,